'దీన్ని బెంగుళూరు తీసుకుపోతున్నాను. ఈజాతిమగకుక్కతో కలపవలెనని.

స్టేషనుమాస్టరు కొంచెము నవ్వాడు. పెద్దమనిషి కనుబొమలమీద మాత్రం కొంచెం నల్లటిరేఖ యేర్పడ్డది. అయినా నవ్వాడు.

తరువాత మళ్ళీయిద్దరూ స్నేహంగా మాట్లాడుకొన్నారు. స్టేషనుమాస్టరు సీమకుక్క అందానికి, మొగాన మచ్చకూ, తోకకుచ్చుకూ, దాని గోధుమ వన్నె రంగుకూ మిక్కిలి మెచ్చుకొని దాన్ని ముద్దాడాడు. దానికి పిల్లలు పుడితే నాకోపిల్లను తప్పకుండా ఇవ్వాలని వాగ్దానం చేయించుకొన్నాడు.

ఊరకుక్కసంసర్గంచేత సీమకుక్క ఒళ్ళంతా మన్నయింది. అంతకు ముందే వాన కురిసి పక్కనున్న పెద్దబండలమీద నీటిపడెలు కట్టినై. పెద్దమనిషి తనతోలుపెట్టె తెరచి రెండుతికిన తువాళ్లూ సబ్బుబిళ్ళా తీసి ఆపడెలో కుక్కను అభ్యంగనము చేయించి తువాళ్ళతో దాన్ని చక్కగా తుడిచాడు. ఇంతలో రైలు వచ్చింది. ఆయన కంయికంయి మని అరుస్తున్న కుక్కను తువాళ్ళలో చుట్టి చంకను పెట్టుకొని రైల్లో ఎక్కాడు. మగకుక్క ఆడకుక్కకు దూరంగా నిలుచుండి కుంటుతూ కుంటుతూ దానివంకనే సాకూతంగా చూడడం మొదలు పెట్టింది. ఆయన కిటికీలోంచి తొంగిచూచి కుక్కవైపు రెండుసార్లు కర్ర ఆడించాడు. అది మరీ దూరం పోయింది.

రైలు సాగింది. సీమకుక్క కంయి కంయి మని తలుపుదగ్గరకు పోతుంది, తొంగి చూస్తుంది. అతడు గొలుసుతో లాగి పట్టుకుంటాడు. రైలు బెంగుళూరు పోయినతరువాత కుక్క ఏడుపు మానేసి యజమానిదగ్గర చనువుగా కూర్చుంది. అతడు దాన్ని ఒళ్ళోకి తీసుకొని "లీలా! అల్లా చెయ్యవచ్చునా?" అని దానినోట్లో నోరు పెట్టి ముద్దు పెట్టుకొన్నాడు. ఇందాకటి కుక్క ఊపనే చేస్తే అంత హృదయంగమంగా ఊరుకొన్న ఆకుక్క పరపురుష చుంబనం పరిహరించినట్లుగా అతనిచుంబనం పరిహరించింది.

౨

దుర్గములో కుక్క తనతోంటి గాడిదగడపాకులకూ, అడ్డసర పాకులకూ వేసి రుద్దుకొని సెలయేటిఒడ్డున ఉన్న ఒంకమట్టిలో అద్దుకొని పదిహేనురోజులకు కాలు సరిచేసుకొన్నది. మళ్ళీ స్టేషనులోకి వస్తున్నది. మిఠాయిదుకాణంవంక చూస్తున్నది.

ఒకనాడు ఇద్దరు విద్యార్థులు అక్కడికి వచ్చి దుకాణంలో ఏదో కొనుక్కొని తింటూ బల్లమీద కూర్చున్నారు. వాళ్ళ యిద్దరి మాటలూ కుక్కచెవిని పడ్డవి.

“మనదేశంలో భూతదయ అన్నది లేదు. పెద్దవాళ్ళందరూ పిన్న వాళ్ళమీద అధికారం చేస్తారు. నేను బి. ఏ. ప్యాసైనాను. ఉద్యోగమిచ్చే దిక్కులేదు. పేదవాళ్ళు మలమల మాడిపోతున్నారు, గొప్పవాళ్ళు సోఫాలమీద గాని ఒరగరు” అన్నాడు ఒకడు.

“మనవాళ్ళు అందరూ స్వార్థపరులే. పిడికెడు బియ్యం పెట్టరు. చివరకు కుక్కకు చేసిన ట్లన్నా పేదవాళ్ళ కింత చెయ్యరు” అన్నాడు రెండోవాడు.

కుక్క వాళ్ళదగ్గరకు వచ్చి వాళ్ళచేతిలో పొట్లంవంక చూసింది. వాళ్ళిద్దరూ ఇంగ్లీషులో మాట్లాడు కొంటున్నారు. అందులో ఒకతనికాళ్ళకు బూట్లు ఉన్నవి. కాలుమీద కాలు వేసుకు కూర్చున్నాడు. ఆబూటు కాలితో కుక్కను డొక్కలో తన్నాడు. దానికి రెండుమూడు రోజుల నుంచీ తిండి లేదు. ఆదెబ్బ పొట్టలో ఏనరానికి తగిలిందో అది మెలికలు తిరిగిపోయింది. కొంతసేపటికి కది తెప్పిరిలి లేచి పోయింది. రెండవవిద్యార్థి తనచేతిలోది కొంచెం దానిముందర వేశాడు. అది నొప్పిచేత దానిని ముట్టుకోకుండా పోయింది.

ఆరోజు సాయంత్రం కొండమీదనుంచి ఒక వేగోటం దిగి రాత్రిపూట

స్టేషనులోకి వచ్చింది. కుక్క భయపడి దుకాణంక్రింద గూడుగా ఉంటే దానిలో దాక్కుంది. స్టేషనంతా నిర్జనంగా ఉంది. వేగోలం పని పట్టి ఆగూటిదగ్గర కావలా వేసింది. వేగోలం మూతి గూట్లోకి పెడితే కుక్క లోపల దాక్కొని దాని మోరంతా కరిచింది. వెనక్కు తిరిగితే తోకా, పృష్ఠభాగం గాట్లు చేసింది. వేగోలం మైమరచి ఉంటే కొంచెం బయటికి వచ్చి దాని మెడ పట్టుకొని గుంజింది. అది కరవవస్తే తను గూట్లో దాక్కుంటుంది. ఇట్లా మూడు నాలుగు గంటలు దాగుడుమూతల యుద్ధం చేసి ఒక ఒడుపులో వేగోలంపీక పట్టుకొని దాని ఊపిరి ఆగేదాకా కుక్క వదల లేదు.

తెల్లవారిన తరువాత అందరూ వచ్చారు. కుక్క పౌరుషం చూశారు. ఏడాది రెండేళ్ళుగా మర్యాద లేని ఆకుక్కకు ఆనాటితో మర్యాద ఎక్కువైంది. స్టేషనుమాష్టరు దానికి రోజూ అన్నం వెయ్యమని ఫర్మానా యిచ్చాడు. ఆరోజు సాయంకాలం అంగడివాడికి మహాదయ కలిగింది. ఒక్కబూందీపూస బీరువోనియ్యాని ఆఫీసినిగొట్టు సంవత్సరముబట్టి పరిశిష్టపు నూనెతో పరిశిష్టంగా వస్తున్న మిఠాయిజంగిలీ దానిముందర పెట్టాడు. ఆ మిఠాయి మ రెవ్వరూ కొనరు. ఎవ్వరూ కొనకపోడం చేత, వారం రోజుల కొకసారి తాజాగా నూనెలో వేస్తున్నా ఎవ్వరూ కొనలేదు. కుక్కమీద మహాదయ పుట్టి ఆజంగిలీ దానిముందర పెట్టాడు. అది తిన్నది; అప్యాయంగా తిన్నది. ఆరాత్రి కుక్క తెల్లవార్లూ మహాబాధ పడుతున్నట్లుగా ఏడవటం మొదలుపెట్టింది. ఇంట్లో పడుకొన్న స్టేషనుమాష్టరూ, పోర్టరూ వేగోలాలు వచ్చినై అనుకొన్నారు. కుక్క పగలు పోయి పొలాలమీద అడవులమీద తిరిగి వస్తుంది. దాని కేదో మహావాతం పుట్టింది. కనపడ్డ ఆకల్లా కొరికింది. ఏ ఆకూ పని చెయ్యలేదు. ఒండుమట్టి నాచేత కాదంది. సెలయేటినీళ్ళు ఇది మాపని కాదన్నవి. రాత్రిళ్ళు స్టేషనులో పడి ఏడుస్తుంది. మెలికలు తిరిగిపోతుంది. తన నడుము

రైలు కింద పడ్డట్టు గోల చేస్తుంది.

వారమురోజు లీరీతిగా కొట్టుకులాడితే దాని వ్యాధి ఉపశమించింది. రెండురోజు లుపవాసం ఉండికూడా వేగోలాన్ని చంపిన యీకుక్క వారము రోజు లయ్యేటప్పటికి చిక్కి శల్యమైపోయింది. దాని వెనక కాళ్ళు మొత్తా తప్పబడిపోయినవి. అది యెక్కడో ఒకచోట పడుకొని మూలగ దానికి కూడా ఓపిక లేకుండా సన్నగా మూలుస్తున్నది. దానికి మిఠాయి అంగడి అంటే భయం వేసింది. అంగడివైపు పోదు, అంగడివంక చూడదు. మునుపు స్టేషనులో యథేచ్ఛంగా తిరిగేది. స్టేషనుమాస్టరు గదిలోకి పోయి తొంగి చూస్తే చీడకుక్క, పేలకుక్క అని దాన్ని కొట్టడం మొదలు పెట్టారు.

3

ఆరునెల లైంది. ఆకుక్క చావదు, బతకదు. ఒకరోజు సీమకుక్కను తెచ్చిన పెద్దమనిషి వచ్చాడు. మాస్టరూ ఆయనా పూర్వపరిచయాన్ని మగిడించుకొని మాట్లాడుకొన్నారు. మాస్టరు "ఏమండీ, కుక్క పిల్లలను పెట్టిందా!" అని అడిగాడు: పెద్దమనిషి ఇట్లా అన్నాడు. "అయ్యో, కుక్కను బెంగుళూరు తీసుకెళ్ళాను. జాతికుక్క నెక్కనివ్వలేదు. మా వూరకుక్క పాడుచేసింది. కుక్క రెండుపిల్లలను పెట్టింది. ఊరకుక్కల్ని పెట్టింది. నాకు చాలా విచారం వేసింది. ఈసారి మంచిపిల్లలు పెడితే మీకు తీసుకువచ్చి యిస్తాను." స్టేషనుమాస్టరు "మా కుక్క చాలా మంచిదండీ! అది మంచిపోరుగాలి. కొన్నాళ్ళకిందట అది వేగోలాన్ని చంపిం"దన్నాడు. పెద్దమనిషి "పోనిద్దురూ! వెధవకుక్క! నాకు దానిని చంపవలెనని ఉంది. ఇంకా అది మీ స్టేషనులో ఉంటే చూపించండి, దాన్ని నరికి పోతా"నన్నాడు. ఇంతా స్టేషనుమాస్టరు "ఏదో పెద్దవాతం పుట్టి కుక్క పాడై పోయిం"దన్నాడు.

ఇంతలో ఆకుక్క యీడ్చుకుంటూ అక్కడికి వచ్చింది. స్టేషనుమాస్టరు ఇదే నండీ అని చూపించాడు. పెద్దమనిషి కోపం పట్టలేక తనచేతిలోని పేముబెత్తంతో ఒకటి వేశాడు. అది పారిపోలేక అక్కడే ఒకపక్క కొత్తిగిలి మెడా కాళ్ళూ యెత్తి యేడ్చింది. పోర్టరు వచ్చి కాలితో దాన్ని అవతలికి తోశాడు. మాస్టరు నవ్వి "మీ కెంత కోపమండీ!" అన్నాడు.

వారి యిద్దరి స్నేహమూ బలిసి ఆ రాత్రి పెద్దమనిషి స్టేషనుమాస్టరుగారికి అతిథిగా ఉండిపోయినాడు. ఆనాటిరాత్రి ఆకుక్క రైలుక్రింద పడ్డది. రైలు దాని నడుముమీదనుంచి పోయింది. "అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగమ్ము ఖండించి" నట్లు, రైలు వ్యాధిగ్రస్తమై నష్టశక్తినదై దానిపశ్చార్ధమును ఖండించింది. కాని శేషాంగ శ్రేణికి రక్ష లేక అది అరగంట తన్నుకొని చనిపోయింది.

౪

తరువాత నాల్గునెలలకు ఆపెద్దమనిషి తనరెండు కుక్కపిల్లలలో ఒకటి చచ్చిపోయిన దని చెప్పి రెండవదానిని స్టేషను మాస్టరుగారి కిచ్చాడు. అది ఆరు నెలల్లో యెదిగి తనతండ్రివలె ఐనది. దానికి భయము లేదు. ఎదురుగా నున్న కొండమీదికి సికారు పోయివస్తుంది. ఎవ రన్నా దానికి మిఠాయి పెట్టబోతారు. అది వాళ్ళకు పళ్ళు చూపించి కరవవస్తుంది. ఎన్ని ఆడ కుక్కలు వచ్చినా వాటివంక చూడదు. అది పిల్లవేగోలాలను కుందేళ్ళనూ నక్కలనూ వేటాడుతుంది. విద్యార్థులు వచ్చి భూతదయోపన్యాసములు చేస్తూంటే వాళ్ళవంక ఓరగా తిరస్కారముగా చూస్తుంది. ఆపెద్దమనిషి వచ్చి వర్ణవ్యవస్థనుగూర్చి స్టేషనుమాస్టరుతో మాట్లాడుతో ఉంటాడు. ఈ కుక్క వస్తే దీనిని ముద్దుగా ముట్టుకోబోతాడు. అది కోపంగా పళ్ళు చూపించి జీర్ణముకాని వేగోలపు మాంసం కక్కిపోతుంది. రైలు మెలుదూర

మున్న దనగా ముక్కోళ్ళతో శ్వాస యెగలాగి పసిబట్టి సీదరించుకొని తొలగిపోతుంది.

మిఠాయిదుకాణమువాడొకనాడు చద్దిమిఠాయి దానిముందర వేయబోయినాడు. అది వాడి పిక్కకండలు పట్టి లాగింది. అది వేగోలం గాని కుక్క కాదన్నారందరూ. దానికి మనుష్యుల్ని చూస్తే వెగటు వేసింది కాబోలు. కొన్నాళ్ళకి జనసమ్మర్దమైన ఆస్థలాన్ని వదలిపెట్టి అడవుల్లోనే ఉంటూ వచ్చింది. అప్పుడప్పుడు స్టేషనుదగ్గరకు వస్తుంది. నిత్యగహన సంచారంవల్లనో, తల్లిపోలికో తోకకుచ్చు బలిసింది. కోరలు వచ్చినై. మనుష్య గాలి తగిలితే బృహస్పతి తమ్ముడు సంవర్తమహార్షివలె సీదరించుకొని తొలగిపోతుంది.

౧ ౯ ౩ ౬

# మట్టెల రవళి

## శ్రీ కవికొండల వేంకట రావు

తొలకరివానలకు తగిలిన కొత్తకొత్త నీటితో గోదావరితల్లి చెందిరించు ఉర్రుళ్ళూగుతూ వుంది. ఆయుషుకు కుంకు మర్దిస్తూ వుందా అన్నట్టు ఎర్రగా తురాయిమొక్క పూసి, వొద్దునే కన్పిస్తూవుంది. ఆకాశపు కరళ్ళ నాదానికి హాంగుగా తాళం వేస్తూందా అన్నట్టు పసరాకులతో రావిచెట్టు రేవు చెంత ధ్వనిస్తూ వుంది. "ఓ గంగమ్మతల్లీ! ఇదిగో! నీకు రవికల గుడ్డలు, ఇవిగో! నీకు రంగురంగుల చీరలు అన్నట్టు సాయంకాలసంధ్యాదేవి వన్నెచిన్నెలమయమై తొలుకాడుతూ సౌభాగ్యవతు లగు ద్విజాంగనలలో అనే పత్తూలవరసల్ని వెదరుమతూ వుంది.

కొత్తగా తగిలిన నీరు, శబరి నీరా లేకపోతే పరిసరాల్ని వున్న ఎర్ర రాళ్ళదిబ్బ మీదుగా ప్రవహించి రంగుమద్ద కలిపిన రాజమహేంద్రవరపు నీరా, అనే సంశయం గట్టునుండి వితర్కించే మనుష్యమానసాన్ని ఇంకా గుంజిస్తూనే వుంది. శబరి నీరైతే అంత ఎర్రగా వుండ దంటున్నారు కొందరు. శబరి నీరు కాకపోతే ఆ పాటుదల వుండ దంటున్నారు కొందరు.

ఇలా కొందరు, అలా కొందరు అనుకునేవాళ్ళు అనుకుంటూనే వున్నారు. ఆరాత్రి గడచిపోయింది. మరునాడు తెల్లవారి ఎనిమిది తొమ్మిదిగంట లవుతుంది. పట్టపగలు పుష్కరరేవులో పల్లెజవ్వని నావలోంచి చేవలగంప నింపుకొని వొడ్డుకు దించుకుని, పయట సవరించుకుంటూ వుంది. పదిమంది కొను

గోలుగాళ్ళు మూగేరు. పెద్దచేప, చిన్నచేప, ఎత్తి చూచి ఎంత కిస్తావు? ఎంత కిస్తావు? అని అంటున్నారు.

దూరాన్నే నడేట్లో లంక, లంకలమీద జనం, ఆ జనం వేసుకొన్న తాత్కాలిక కుటీరాలూ, కుటీరాలను బట్టి ఆరగట్టిన వలలు- అన్నీకూడా ఒక్కక్షణంలో అల్లకల్లోలము అయిపోతూ మహాదృశ్యం వొకటి ప్రదర్శింపున కొచ్చింది. ఏమిటని? పెద్ద ప్రవాహం! నీటివంక చూస్తే వినుగునడక, నురువువంక చూస్తే తెడిపరుగు. లంక మీది జనం, జనం వేసికొన్నకుటీరాలు ఆరుతూ వున్న వలలు. అన్నీ మునిగిపోయినాయి. ఒక్కవంతెన వంతెనమీదగా వస్తూవున్న మెయిలుబండీ, అదొండే శాశ్వత మన్నట్లు, తోచినాయి. పల్లెజవ్వని వెనక్కి తిరిగి చూచింది. ప్రవాహం వచ్చేసిందని తెలిసి కాదు. మెయిలుబండి అప్పుడే వస్తూంది. దాని చప్పుడుకు వెనక్కి చూచి, బేరగాండ్రతో "నన్ను పోనీయండర్రా! బండికూడా వచ్చేసింది. నాకు దారియ్యండర్రా! చూడండి ... మీతో బేరాలు ఎప్పటికీ తెగవు. బజారుకు పోతాను" అని అనా అనీ, బేరగాండ్రను తప్పించుకు బజారుకు పోదా మనీ దానివూహ. ఆవూహతో వెనక్కి తిరిగి చూచింది.

కాని పాపం! మెయిలు వేగం కంటె, మెయిలు చప్పుడు కంటె, గోదావరిగంగ యెక్కువగా మోసింది, ఎక్కువగా హోరిమింది, దానికన్నుల్లోనూ, దానివీనుల్లోనూ. అంతే కాదు; దాని హృదయకుహరంలోకి వంతెన స్తంభాలు కూలి వంతెన ప్రీలి పడ్డట్లు అయిపోయింది. దానికనువు తరుక్కుపోయింది.

తెచ్చిన చేపలన్నింటినీ వచ్చినమనుష్యులే యెత్తుకపోయినారో, గద్దలే యెగరేసుకు పోయినారో కూడా కానకుండా ఆ స్త్రీ గట్టున్నటే వాలు వడివలా నడుస్తూ వుంది. మధ్యాహ్నం ౧౨ గంట లైంది. అపరాహ్ణం మూడైంది. సాయంకాలం ఆరైంది. ఆమె అలా నీటికేసి చూపెట్టుకు నే

నడుస్తూ వుంది. ఆమె కేదో దృష్టిపథాన్ని కనబడుతూ వుంది. ఆమె పెని-మిటిలా కనిపిస్తూ వుంటూ దేవడో మనిషి. నీటితో పెనగులాడుతూ ఎదరీ తను గట్టుకు వస్తూవున్నట్టు వుంటాడు. మళ్ళీ జారిపోతుంటాడు. దృష్టి నుంచే జారిపోతుంటాడు. ఎలా రక్షించేది అతణ్ణి? ఎవరు రక్షించేది అతణ్ణి?

బహుళపక్షము. చీకటి పడిపోతూ వుంది. పైపెచ్చు ఝుంఝూమేఘం కమ్ముతూ వుంది. చిటపట చినుకు ఇదిగో అదిగో అంటూ వుంది. రాత్రి ఎనిమిది తొమ్మిది కూడా అయింది. ఎలుగెత్తి పిలుస్తుందా? వెలుగేమైనా చూపిస్తుందా? చేయి విసురుతుందా? ఆమె ఏమి చేయడానికీ అశక్తురా లనుకొంది. ఆ అబలకు మరో ఆలోచనే తట్టలేదనుకొంది. ఏలాగయితే ఉదయం తొమ్మిది నుంచీ గట్టుమ్మట నడుస్తూ ఆ దృష్టిపథాన్ని పడేవాడు తనభర్తేమో అని ఆసాసతో అనుకొంటూవుంచో అలాగే అనుకొంటూ అలాగే నడుస్తూ వుంది రాత్రి తొమ్మిదిగంట లప్పుడున్నూ!

ఆమె దృష్టిపథాన్ని అప్పుడప్పుడు డోవడుతూ అప్పునా, కౌదా అని పించేవాడు నిజంగా ఆమె పెనిమిటి నాగడు. వాడు హఠాత్తువరద తోమన్నా చటుక్కున కొట్టుకుపోయినాడు. ఈదగలడు. కాని ఎందాకా అని ఈత్తాడు? ఆధారమేమైనా వుంటే కొద్దిగా నిలదొక్కుకొని ఒడ్డున పడగలడు. కాని తొందరలో మనిషికి అసలే ఆధారం నున్న. జంతువు కేదో స్వతస్సిద్ధమైనశక్తి సామర్థ్యం అనంత మయింది వుండవచ్చును. కాని మనిషికి అలాంటిది వున్నట్టు కనుపించదు. మనిషి శరీరనిర్మాణంలో కొమ్ములు లేవు, తోక లేదు, నాలుగు కాళ్ళు లేవు. పోనీ పడగ లేదు. ముడుచుకుపోయ్యే గోళ్లు లేవు, ముందుకు వచ్చే కోరలు లేవు, ముళ్ళు లేవు, పొలుసు ల్లేవు, వేళ్ళవేళ్ళ మధ్యనూ చర్మం లేదు. ఏదీ లేదు. మనిషి కేదీ లే దని చెప్పొచ్చు.

మనిషి అయినవాడు తోలీవరదలో ఏదైనా పోనీ ఓఆధారం చూచు కుంటాడా అంటే వాడి కక్కనబడే వన్నీ అడ్డే కాని ఒక్కటీ సహాయమైంది

దొరకదు. నురుగు అడ్డు. నురుగుతో కంప అడ్డు. ఇం తెందుకు, తనగుడ్డలే తన కడ్డు. పోనీ కొట్టుకు వచ్చే కలప నాధారం చేసుకుంటాడా అంటే ఆ కలపలో పాచి కట్టుంది. షావుకార్లు కలపను కూనార్గం మీదుగా తెప్పలు గట్టి తోసుకు వస్తూ వుంటారు. ఆలాంటి తెప్పలు కొంతదూరం వచ్చేసరికి వాటికంటె ముందంజ అయిన వరద ఆతెప్పల్ని విసగొట్టి చెల్లా చెదురు చేసి అకలపనూ అసలు సద్యఃఅవరదకు విరిగిపడ్డ చెట్లనూ ఏకం గావించి ధ్వంసంచేస్తూ వుంటుంది. ఈదేమనిషి షావుకార్ల కళ పెక్కేడా ఆకలప నిలవకలవ అనడంవల్ల పాకుడు కట్టి వుండే జర్రున జారి తిరిగి గోదాట్లో పడిపోతాడు. ఆకలవ దిగుచాయకు పోతుంది. ఇల్లాగ్గా మోస పోతాడు. అడవిచెట్టు కొమ్మేదో దొరికిందా బ్రతుకు జీవుడా అనుకొంటూ కాపాడంత సేవ తేరతాడు. కాని దాని తొర్రలోనో, దాన్ని చుట్టబెట్టు కునో మహాసర్పం కనుపించి పై ప్రాణాలు పైనున్న పోళంగా ఎగరగొట్టే స్తుంది. తొల్లి నాగడి కొంతసేపూ షావుకార్లకలవతెప్పల విడిపోయిన తుండ్లే దొరుకుతూ వచ్చేవి. వచ్చి వచ్చి జారిపోయేవి. అలా జారిపోవ డంలో ఆనకట్టు దరిదాపునకే జారిపోయినాడు పాపం! అక్కడ గడ్డిపరక పట్టుకున్నాడు. ఇంకో క్షణాన్ని పాముతోక పట్టుకుని దాన్ని వెనక్కు లాగి అది కాటు వెయ్యబోతే బుడుంగున మునిగిపోయి నీట్లోనే 'అమ్మో' అన్నాడు. ఇంకో సారి కోఎద్దుమూపురం సందేట గదించి కొంతదూరం తేలి, అది పట్టివ్వకపోతే, వదిలేసి ఆ శవకాతలే కొట్టుకొస్తూ వున్న ఇలారం ఎక్కి కూర్చున్నాడు. అలా కూర్చున్న నాగడిమీద కాకి వాలింది. అ దేదో బ్రహ్మరాక్షసి అనుకొని పిల్లిమంతరం చేసి ఆకాకిని తప్పించుకొని, నీటిలో కరికి అలసిపోయినాడు.

రోజులిస్తే నాడిబతుకు ఆపమయంలో ఎలాంటి బతుకు అయి పోయిందంటే- బుడగలో ఊపిరే వాడి ఊపిరి అన్నట్టయి పోయింది.

కనుచీకటి పడేవేళ క్కామోసు నాగడి కోవచ్చికొమ్మ కొట్టుకొస్తూ

వున్నది చేతికి దొరికింది. కాని చీకట్లో దానిరం గానింది కాదు, అదే వొడ్డనుకొని రక్కాడు. ఆకులు తగిలాయి చేతికి. ఏదో గడ్డం అనుకొన్నాడు. ఆ ఆకుల్ని ఇలా అలా వూపి "ఎవరవు నీవు, మనిషివా?" అని అడిగాడు. ఎవరూ పలక లేదు. అయినా అల్లాగానే గడ్డం పట్టుకొని వ్రేలాడుతూ వున్న అభిప్రాయంతోనే దాన్ని వెంటాడించాడు. అదో సుడిగుండంలో గిర్రున తిరిగి, అవతల దూరం వున్న దల్లా, ఈత్తట్టుకు నాగడి సమేతంగా వచ్చిపడింది. ఏలాగైతేం రాత్రి నా గంటలకు నాగడు గోదావరీ ప్రాక్తీరానికి చేరుకున్నాడు.

చేరుకున్నాడు! కాని చేరుకున్నలాభ మేమిటి? చీకటి అయోమయం: మనిషీ మాకూ ఒకటే అన్నట్టుంది అంతాను.

మేఘాలు మెరిస్తే కద్దు వెల్తురు, మేఘాలు ఉరిమితే కద్దు చప్పుడు, కాని పిడుగు పడితే? వడగ తగిల్తే? నాగడు! నాగడు! మృత్యుదేవత కఠోర దంష్ట్రా కరాళాల్లోంచి యివతల బడ్డనాగడు! చచ్చిపోతాడే! వాడిబుర్ర చిల్లడి నెత్తురు వరయి పోతుందే!

ఆ చిక్కుసమయంలో నాగడి కెలా తోచిందో! "ఒరేవ్" అని కేకేశాడు. వాడికాళ్ళదగ్గరగానే వుంది అదాతా నడిచి నడిచి వున్న వాడి పెళ్ళాం. ఆ ఆడమనిషి ఏమన్నా "నువ్వేనంట్రా!" అంది. "అవును నేనే" అన్నాడు నాగడు.

ఇద్దరూకూడా ఒక్కమాటు పైచీప ఆకాశం కేసి చూచారు. "నిన్న సాయంకాలం లంకమీద మనం వున్నప్పటి ఆకాశానికీ ఇప్పటి ఆకాశానికీ ఎంత తేడా వుందో చూశావంట్రా?" అంది పిల్ల. నాగడు "దీని ముండా మోపిన వరద!" అన్నాడు.

"ఇంకిప్పుడీ చీకట్లో ఎక్కడికిపోతాం?" అంది పిల్ల. నాగడు "ఎక్కడికి పోతాం?" అన్నాడు.

ఇద్దరూ అలా నుంచున్నారు గట్టుమీద. నాగడు అడిగేడు "ఒరేవ్!

నీవు ఇన్నాళ్ళనుంచీ చేసి అమ్మిన రూపాయలు లంకమీద ఏదరిని కప్పెట్టావే?'' అని. పిల్ల అంది "ఆదరినే. గుడిసెలో ఉత్తరదెస కనిపించలే'' అని. "కనిపించడానికేం లే. అవి మోగించిన పెద్దరాస్తే కొట్టుకుపోయినప్పుడు అవి ఉంటాయో వుండదానా!'' అన్నాడు నాగడు. అంటూ ప్రేమ కొద్దీ పెళ్ళాం శరీరాన్ని తడుముతూ "నీ కాలివేళ్ళను మట్టె లున్నాయా!'' అన్నాడు. "ఆ'' అంది పిల్ల.

"అయితే నడిచిపోదాం! లే! మనవూరు! నీ మట్టెలచప్పుడికి పురుగు పుట్రా వుంటే తప్పుకుపోతాయి. భయం లేదు'' అన్నాడు నాగడు. ఇద్దరూ లేచి నడుస్తూ వున్నారు. పిల్లవి మట్టెలచప్పుడు అవుతూ వుంటే నాగ డింకా అంటాడు, "ఇల్లాంటి చప్పుడేనే పాడుగూతా నే నీపొద్దు గోదారిమీద వచ్చిపోతిరం పోయీప్రాణంగా ఈత్తూ వున్నంతసేపూ వినాది! ఈ మట్టెలచప్పుడేనే నీమట్టెలచప్పుడేనే!''

అలా అంటున్న నాగడికి ముందు నడుస్తూ పైయాసుకు జవాబుగా పిల్ల అంది: "మరీవా ద్దల్లా నీకోసమై ఈగట్టుమీద నడిచింది వరసు కంటున్నావు? నేనే ఈమట్టెల్లో, మట్టెల్లో నేనే! నేనే!''

# ఎండమావులు

శ్రీ వెంపటి నాగభూషణం

కుహుఁ...కుహూఁ...కు...హూఁ

— కలకంఠ వధూకలకంఠ రవానుకారి ... కోకిలధ్వని ... ఆ సుషుప్తి ముద్రాలంకారమూర్తిని... ఊహుఁ కదప లేదు.

ఓ... మదవతీ నవమన్మథ మోహనరూపా!...సంతత రసానంద సారస్వత కేళీలోలా! ...

—అలా... ప్రబంధకవుల రచనాచమత్కృతులను ... తాత్కాలికంగా ఉపసంహరించి, ... మృదుమధుర కంఠంతో, ... కొంచెం అధునాతన భావకవిత్వపు మజాతో ... ప్రబోధించే సరికి:

నాయిక పుణ్యఫలం ... స్వల్పంగా ఫలించి, అతడు ... కొంచెం అటు నిటు మసలి...

—తిరిగీ నిద్దురలో కలిసి మెలిసిపోయి...

ఇక ... మామూలు మేలుకొలుపులతో ప్రయోజనం లేదని,... పాన్పును దరియబోయి, నిలువు చతుష్కాని పక్కకు తొలగించి, స్వీయ బాహువల్లరీ కుశలవ్యాపార పారీణతను ... అతనికి చవి చూపి ఒకవైపునుంచి ఒక వైపుకు ఊగించి ... రెండు చెంపలమీదను, నెన్నొసటను చుంబనాలంకారములను...తోరహత్తుగా ప్రసాదించ:

ఆ ... రసికావతంసుడు ... తమాయించుకో లేక, జాగరణావస్థలోకి ప్రాన్సుధరు అయి, ... అర విచ్చిన కన్నుదోయితో,—తనమీదకు

ఓరగిలి, ... వైతాళిక విధిని నెరవేర్చి ... చిరునవ్వు చలువలు చిలుక రిస్తూన్న ... గృహిణిని విలోకించి...

అప్పటికి, పూర్తిగా సుస్నాతుడై,... ఆమెను నయగారపు మాటలతో ఊరడిస్తూ, ... మెల్ల మెల్లగా ... ఆమె గండద్వితయముమీద లేగులాబీ లను సృష్టించి, ... కోమలస్మితరుచులను తొలకరిస్తూ, ... కొంచెం ఘాక్షుడు గానే ... మంచం విడిచి...

...భర్త విధించినదే అయినా, తనకూ సరదా నిచ్చేపనే కాబట్టి, ... ఆ దైనందిన రసోపేత ధర్మ నిర్వహణానంతరం ... ఆమె, ... ... శయ్యా మందిరం వీడి, ... వెళ్ళలేక, ... వెళ్ళ ... లేక ... వెళ్ళినా ... అతడు మాత్రం ... అక్కడే, నిలువుటద్దం ముందు నిలబడి, ...వన్నె చిన్నెలు మధురభావనలో స్మరించుకుని, ... కులాసాగా క్రాపింగ్ సవ రించుకుని, రెండు ... మూడు ... మారులు ... అవులించి,——ఈలతో ...ఏదో ఆలపిస్తూ, ... ఈ జగతిలో వాడై పోయినాడు.

* *

కవి ననుకునేవాడు గనుక ... తత్కారణంగా విధివతు ... కాఫీగత పాణి గనుక, ఆ భూలోక సుధను ... పూర్తిగా సేవించి రోజ్ వుడ్ మేజాముందు ... రాకింగ్ చైర్ లో సుఖాసీనుడై — శ్వేతకాష్ఠోద్భూత ధవళధూమరేఖా శిల్పాన్ని ... ఏకాగ్రతతో పరామర్శిస్తూ, ... భావ జగతిని విహరించడానికి రెక్కలు విప్పుకొనబోతూ, ఏదో అమూహ్యపు టూహాంచలముల నొరసుకొంటూ ... మై మరచి, ఉపాసనవైఖరిని ... ఉండగా ...

“చూశారా ... ఎంత అన్యాయమో...!”

—అధిష్ఠించిన ఉన్నతశిఖరాల మీదకు ... ఆమె మాటలు వినబడకే పోయినా, ... ఎదురుగా నిలిచిన ఆమెను...చూడనట్టుగా నటించలేక ... కృషిచేసి అలవరచుకున్న ... కలల చూపులతో ...

"ఏమిటి..." అనే అర్థం...స్ఫురింపజేశాడు:

పళ్ళావళితో,...తూలుతూ... తొట్రుతూ... ఆమె అతని పరాకును మన్నించకుండానే.. దగ్గరకు వచ్చి...చేతులో ఉన్న "మాగజీన్"ను... పుటలు త్రిప్పుతూ...

"చూశారా...అన్యాయం..."— అని రెట్టించింది: తప్పనిసరిగా... అతడు, మొహం ఆమెవైపుకు త్రిప్పి:

"ఏం... "కిరణావళి"... వచ్చిందా?..." అన్నాడు.

"ఆఁ... వచ్చింది, ఏలాగైతేనేం. ఎందుకూ?... మీగీతాలు గాని,... కథ గాని అచ్చు పడలేదు..."

కలిగిన ఆశ్చర్యాన్ని...అంతగా పైకి కనబడనీకుండా... "మాగజీన్"ను అందుకుని,... అటు ఇటు త్రిప్పి చూచి... ఆమె అన్నది యథార్థమే నని రూఢి చేసుకుని...కొంచెం దిగులుతో మూగవోవగా......

"ఏం...లాభం వళ్ళీ... పైకి అందరూ స్నేహితులే. బతిమాలి... మరీ బతిమాలి కాదూ... మీ రచనలను తీసుకు వెళ్ళారని... చెప్పారు మీరు?...మొదటి సంచికకదా... మీ కృతులకు గౌరవస్థాన మిచ్చి ప్రకటించకూడదూ... అంత మాత్రం..."

"...ఈమాత్రానికే..."— చిన్నబుచ్చుకున్నాడు...

"నేను... అనడంలేదు మీతో, ...అడపాదడపా... మీ సాహితీ సమీహాలు... పట్టి... ఎండమావు లని..."

అతడు... తొణకలేదు...

పరస్పర సంవీక్షణదీక్షలో... అయిదు నిమిషములు:— ఆ క్రొత్తమాస పత్రికను...ఆమె గది మూలకు విసిరివేసి...ఇక అక్కడ ఒకక్షణమైనా...

"ఏమండీ, పైకి పోదాం. రాత్రీ! పొద్దు పోయింది ... అతడు... తప్పించుకోడానికి ప్రయత్నించాడు ... ప్రత్యుత్తర మీయకుండానే. ఆమె ... పెనవేసుకో బోయింది: కాని ... అతడే గెలిచాడు. పట్టు విడి పించుకుని ... తిరిగీ వ్రాతలోకి దిగాడు......

ఆమెకు ... ఆగ్రహం వచ్చింది: కాని ... అనునయాలాపాలతో ... కార్యం సాగించుకోవా లని:

"నిద్దర ... వస్తోందండీ: రారూ..."

—రానని సూచనగా ... అతను తల త్రిప్పాడు.

"అయితే ... స్విచ్ నొక్కి ... లైట్ ఆర్పి వేస్తాను..."

"మారాం చేయక ... వెళ్ళి పడుకో ..."

"ఒంటరిగా నేనా?..."

"ఊఁ ... ..."

ఆమె ... ఆపాదమస్తకము శీతలించి ... తన ఎత్తు సాగలేదు గదా అని నిస్పృహ చెంది ... ప్రయోజనం లేదని నిర్ధారణ చేసుకుని ... అతన్ని వదలి వెళ్ళలేక ... వెళ్ళలేక ... వెళ్ళి ... పో ... యిం ... ది.

——చలించకుండా ... వ్రాస్తూనే ఉన్నాడు: కవి ... కథకుడు ... విమర్శకుడు — అయిన అతని ఆదర్శములు ... ఆలోచనలు ... పోక డలు ... ఇతరులకు అంతగా ... సులభ గ్రాహ్యములు కావు:

...బాహ్యాంతర వృత్తులలో ... నిబిడీకృతమై ఉన్న ... విశిష్ట సౌందర్యాన్ని అభిదర్శించి... తెనుగుతీగలు తీరు తియ్యములను పొంది... పూచి, పరిమళించెట్టుగా దోహదం చేసి, —

... ఆత్మసాక్షాత్కారం కోసం ... ఏకావరణ జన్యములే అయిన ... సౌందర్య రసా నందములతో అక్షినిమీలన కేళి సాగిస్తూ ... ఆనందగీత మును పాడుతూ ... ఆనందసూత్రమును అల్లుతూ ... ఆనందమూర్తిని చిత్రిస్తూ: ... తా నొక అక్షరరమ్య శిల్పిగా ... భావుకుడు గా ...

అదే అతని ఆశయము. ఏది ఎటులైనను ... ఎటు పోయిననూ ... సరే. తన కోర్కెలు ... తన పద్ధతులు ... సమకాలీనుల సమాదరణకు పాత్రము కాకపోయినప్పటికీ ... అతనికి ... అలమట లేదు ... కాని, ... ఏమో? ... 'మానవత్వము అంత పూర్తిగా మరుగుపడి పోతుందా? ...

శ్రీ—డిన్ చేస్తున్నారు. ... ఎదు రెదురుగా కూర్చుని:

అతడే ... ముందు పలుకరించాడు:

“మరి...?”

“ఊఁ...”

“పై శుక్రవారమే ... కాదూ”

“ఏమిటి...?”

“నీ పుట్టిన రోజు”

“ఏమో...ఎప్పుడు అయితే ఏం?...”

“అబ్బ...ఎప్పుడూ...అలుకేనా...?”

“తమరు చేసేవి...అలా ఉన్నవి...”

చెంగున గంతువేసి...లేచి, ఆమెను చేతులలోకి తీసుకున్నాడు...

అబ్బ...ఉండండి...నొక్కుకుంటోంది...లోపల...”

“ఊహుఁ...చెప్పదలచుకున్నది...చెప్పి గాని...”

“చెప్పండి...మరి...”

“నీ...పుట్టినరోజుకు...ప్రెజెంటు...”

“మీ...యిష్టం...”

“శర్మచేత...నీ బొమ్మ పెద్దదిగా గీయించి...”

“అవును,...అలా చెప్పడం...ఎన్నో మార్లో...”

“ఈమారు...తప్పదు. అతనికి కబురంపుతాను ... సామగ్రితో సహా

... ఎడబాయకుండా ... కొంత ఉండడానికి ... నోచుకున్నవారు ... కాలంటికానికి ... మనం ... ఇద్దరం ..."

——విన్నంతవరకూ ... చాలదూ? ... ఆశాసౌధము లన్నీ ... గిరగిర తిరిగి ... నేలలో కలిసిపోయినవి. — ఇంకా ... సందేహమా? ... అయినా ...

చీమ చిటుకు మన్నంతయినా ధ్వని కానీయకుండా... తలుపు తీసి, చూడ లేక... చూడలేక చూసి... అర్థం కాక... తన కళ్ళను ఓ మట్టున నమ్మలేక ...పోయినాడు:

ఎదురుగా... సోఫాలో... ఒకరిమీద... ఒకరు వాలి... ఆమె ... అత్రికాయుడు:

వెనుకవైపుగా ఉండటంచేత... అతని రాక వారికి... పొడకట్టలేదు.

కృత్రిమ తన్మయత్వం... దర్పణంలో ప్రతిఫలించిన... యజమాని దీన మూర్తిని... కనబడనీయలేదు. ఐనా... లక్ష్యం చేసే... స్థితిలో ఉన్నారా...

—అలా... అలా... జారుతూ... పట్టు దప్పి... నిరీహాస్తో కూలిపోయి నాడు —... ఎండమావులనూ... దివ్యోదపూరము లని... అత్యాశతో... కాయ లోయి... పోయి... చివరకు... హతాశుడైన... పాంథునిలాగు...

# కామకోటి

## శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి

'సూచయంతి సుందరి...తవ...సూచయంతి సుందరి! కుసుమాయుధ శాస్త్ర పండితమ్...రమణమ్...'

...కోపం తల మునకలుగా...సంస్కృత గ్రంథాలన్నిటికీ...ఆనాటి భోజరాజు దరిసి సుప్రసిద్ధులకు తలపెట్టిన సత్కారం చేయాలని... లోకాన్నంతా...

ఓం...నిలువకే నంత చిరాకు వస్తున్నది.

అప్పటికి నాలుగురోజులనుంచీ ప్రయత్నం చేస్తున్నాను...మరిచిపోదామని; కాని, మేలుకున్నా కలువరింపు మానేశాయం తోచడంలేదు. ఆ పద్యార్థం లాపాలాగా...పట్టుకు వదలకుండా ఉన్నది.

మొదట...తమాషాగా...ముచ్చటపడి నవ్వుకున్నాను; తరువాత, కొంచెం చిరాకు తెచ్చుకున్నాను; ఇప్పుడు...గింజుకుంటున్నాను; ఊహుం...ఏ సుముహూర్తమున నన్ను వరించిందో...ఏమో...వెన్నెల వచ్చింది.

క్లబ్బునుంచి అప్పుడే యింటికి వస్తున్నాను; గుమ్మానికి పెడల్ డీకొట్టకుండా, కాలితో ఆపుకుని, సీటు దిగకుండా...పని అయిపోయినా... చిగురుదమ్ముల పస తెలిసిన రసికుణ్ణి గనుక పెదవులకు అంటే చురుకును సహించుకుంటూ, శేషరూపలేశమైన సిగరెట్-కన్యను బలవంతాన మరో రెండు దమ్ములు లాగి...పేవలకు ఉద్వాసన చెప్పి తప్పించుకున్న గాలి యిడి. దర్జాతో లోపల ప్రవేశించాను.

కోటు కుర్చీమీదకు...విప్పుకునేటట్టు విసిరి వేసి, రేకెట్ ప్రెస్‌లో అమర్చి

...ఉద్దండుడు, యేదో పథకం వన్నుతున్నాడు; అలా కాకపోతే... ఏమిటి యీ చోద్యం? మదన సామ్రాజ్యానికి యావత్తూ ప్రధాన అమాత్య కోడాలోవాడే...పక్షియని ముక్తికాంత ఉపగూహనం కోసం, రాచ కార్యాలు కట్టి బెట్టుకుని కూర్చోగల తీరిక ఉన్నదా? వేదాంతమా అంటే, ఛాందోగ్యంపాఠం చెప్తుతూ, దహరాకాశాన పరమాత్మకు ఉనికి ఉన్నా, మానినీ, ప్రణయజ్యోత్స్నలు అక్కడ పాలలాడి పోతూండ వలసినదే నని...పంతానికి సాధించిన భావకుడే!...మరి ఏమిటి ఈ వాలకం?

ఇక ఆలోచించకుండా ఆయన కొంటెతనానికి మైపెత్తుగా, సాగిలపడి ప్రొణిక్కి, తెచ్చి; పేంట్సుమీద మోకాళ్ళకు అంటిన మన్ను దులుపుకుంటూ, చేసిన ఘనకార్యానికి అభినందనాతే మైనా తగులుతాయేమో నని... అమ్మమ్మ వంక చూశాను.

...లాభించ లేదు: పైగా, ఆమెకు అల్లరి అర్థం కాకపోవడం అటుండగా 'నీవూ మీతాత గారు చేసిన పనికి సాక్షిస్తూన్నావా' అనే అర్థపు చూపు పెట్టి...మన్యవేగం నిలపదీసుకుంటూ...

'ఇదీ వరుస, నాయనా' సంధ్యపడక ముందునుంచీ; ఎన్నో విధాల బతిమాలాను. కాళ్లు పట్టుకున్నాను, నెత్తీ నోరూ కొట్టుకుని 'ఇది మీకు తగదు' అని మొరపెట్టాను. నీవుకూడా చెప్పిచూడు; అప్పటికీ ఆయన మనసు మారవట్టాయేనా, నన్ను భరించడానికి ఆ గంగాభవానే ఉంది! ఇంత కాలానికి...ఇన్నేపడిలో...నన్ను విడిచేసి—సన్యసించుతారా?

నేను, ఆమె మాటకు అడ్డం తెళ్ళి.—

'ఇప్పుడు ఆసంగతేం వచ్చిందీ? నీ మీద కోపంగా ఉన్నాడా?' అన్నాను.

ఆ మాట అడగగానే, వాళ్ళ సంసారిక ప్రణయాన్ని అవమానించానని, రోషం వచ్చి, ఆమె చూపు చురచుర లాడింది—ఆ పుణ్యదంపతుల విషయంలో అలాంటిది అసంభవం అని తెలుసును. కాని, కేవలం మాటవరుస

నేనూ, నాతో పాటు అమ్మమ్మా తాతయ్యా శ్రుతి అందిపుచ్చుకుని... నవ్వాము.

పాపం! హడలి పోయిం దయ్యా!

అలా కాదు: మాట దక్కించిం. మీ అమ్మమ్మ, విరహవేదన ఎంత మజాగా అభినయించేదనుకున్నావు...పడుచుదనంలో? ఒకమారు చూద్దామని ముచ్చట పడింది. ఫరవా లేదు. వెనుకటి బింకం ఏలా వస్తుంది కాని!... నేను మాత్రం...ఇప్పుడు నిత్యం...భోజనానంతరం రాత్రులు...మహాభి నిష్క్రమణం చేస్తున్నా నా ఏం...ఉద్దీపన లేందీ వీణ మోగదు.

ఎంత నాటకం ఆడావూ?

అవును బాబూ...మా ముసలి ముచ్చట్లు మేమే తీర్చుకోవాలి కాని... ఎవరు ఆదుకుంటారు?...

...వాక్ప్రవాహానికి, చప్పున అడ్డుకట్ట వేసి...తాతయ్యా...చెవులు తోర పెట్టుకుని...వింటున్నాడు...కారుమబ్బులు దూసుకుని...ఫెళ్ళున వెలిగే చందమామ లాగా...ఆయన ముఖం కళకళలాడి పోయింది...అంటించ బోతూన్న చుట్టను...తీసి, చేత బుచ్చుకుని...అతి హుషారుగా...లేచి నిలుచున్నాడు. నేనూ...సిగరెట్...ఆ పరిస్థితిలో అంటించడమా మానడమా అనే విచికిత్సలో పడిపోయినాను...తాతయ్యా...ఇంత హంగమా చేసిన తరువాత...కొంచెం తెప్పరిల్లేదాకా...ఆయనను అక్కడనుంచి కదల నియ్యా దలచుకో లేదు...వదల దలచుకో లేదు.

కూర్చో...

వీలు లేదు...శివాజ్ఞ అయింది: పలుచని పద్మినులను వలచే...సుకుమార రసికులు అయౌను...మీ సజ్జు అంతా...నీవు. తీరామీగా...కూర్చుని... కాల్చుకో...పొగలతీగెలలోనే ... మీకు ... ప్రియురాలి వగ అన్నీ కను మిస్తవి...మేం...అంత తీరుబడికి మహా ప[illegible]నంలో కూడా నోచుకో

లేదు నుమా?...ఎందుకు...చెవులూ, కన్నులూ కలిగినలాభం ఇంకా వినిపించడం లేదూ?

ఒకరిని మించాలని ఒకరము ... పందెం వేసుకున్నట్టుగా ... అంగలతో దూకుతూ...వాకిటిలోకి వచ్చాము...అమమ్మ మాటే మరచిపోయి

ఇంటిముందర పెళ్ళివారు ఎవరో, ఊరేగుతూ ఆగారు. మేళంలో... పచ్చసిల్కు ఫ్రాకు వేసుకున్న ఓ పిల్ల...

రమ్మనే! మహారాజా...! అనేపదం పల్లవి ఎత్తుకుని అభినయిస్తూన్నది

# నిరీక్షణ

## శ్రీ సురవరం ప్రతాప రెడ్డి

"శంకరన్! దినమూ సూర్యుడు తూర్పుసముద్రమునుంచి పైకి లేచి మళ్ళీ పడమటి సముద్రములో మునుగుతూ వుంటాడు. రాత్రంతా యెక్కడ వుంటాడు? మళ్ళీ తెల్లవారేవరకు తూర్పు కెట్లా వస్తాడు?"

"కుమారీ! అది అనాదినియమం. ప్రతివస్తువుకూ ఉదయం, అస్తమయం ఉన్నది. అస్తమించే వస్తువు మళ్ళీ ఉదయిస్తుంది. మన యీ ప్రాంతాల్లో తూర్పు పడమటిసముద్రాలు కలిస్తవి. అందుచేత సముద్రంలోనే పుట్టి సముద్రంలోనే మునిగినట్లు కనబడుతుంది."

"అయితే వేరేదేశాల్లో ఎట్లా వుంటుంది?"

"ఈఅందం అక్కడ లేదు. ఉత్తరాన పోయ్యే కొద్దీ భూమిలో మునిగి, భూమిలోనుండే పైకి వచ్చేటట్లు కనబడతాడు."

"ఆ అలలు చూస్తివా? యెట్లా వొకటినొకటి పడుతున్నవో! ఎప్పుడూ వాటికి విరామం లేదా?"

"అఖండప్రేమ అంటే అట్లే వుంటుంది... కొమద్పట్ల లేమి గాని యింక కొంచెం సేపట్లో సూర్యుడు మునుగుతాడు. మనము దినములాగా యిక్కడ నుండి సముద్రం అంచువరకు దొర్లుదామా, రా."

"ఊహూం దినమూ నేనే ముందు దొర్లా లేమి? చూడు, ఎంతయెత్తు నుండి దొర్లుతామో? రెం అంగుల ఎత్తుగా వున్నది యీయిసుక దిబ్బ!"

"నీవే ముందు దొర్లవాలె."

"లేదు. నీవే"

"సరే. రా!"

శంకరన్ ముందు అవీ ఇవీ సముద్రతీరం యిసుకదిబ్బమీద అడ్డము పండుకొని పల్లీలు కొడ్తూ ఇంకా దొర్లినాడు. కుమారి వానివెనుకాలనే దొర్లింది. శంకరన్‌మీద ఆమె పడ్డది. కిలకిలా నవ్వుతూ ఇసుక కంతా దులుపుకొని చేతులు పట్టుకొని ... పైకి లేచినారు. ఇట్లా ఎన్నో మాటలు దొర్లినాయి. ఇంతలో ప్రొద్దు మునిగింది. ఇద్దరూ వళ్ళొకరు రాచుకుంటూ యింటిదారి పట్టినారు.

* *

శంకరన్ తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోయినారు. తన మేనమామ యింట్లో పెరుగుతున్నాడు. అప్పటికి వయస్సు ౧౮ వుంటుంది. మంచి స్ఫురద్రూపి. సాధారణంగా బెస్తవాళ్ళు బెస్తవారు అంటే నల్లగా వుంటారు. కాని శంకరన్ గోధుమవర్ణమువాడు. దినమూ ఆకన్యాకుమారి తీరమువద్ద సముద్రములో తన మేనమామ వెంటపోయి చేపలు పట్టుక వచ్చేవాడు. కుమారి తలిదండ్రుల కొక్కతే కూతురు. వయసులో చిన్నదైనా చేపల కూర, అరటికాయ వేపుడు, పనసకాయ, అన్నము, సాంబారు బాగా వండగలదు. మంచి అందమైనపిల్ల. కొంచెం నల్లనిదైనా ముక్కుమొగము తీరుగా చూచిన చాలా ఆకర్షణీయముగా కనబడేది. కొబ్బరినూనెతో నిగనిగమనే వెంట్రుకలు అన్నీ బారెడేసి పొడుగు. పిల్ల పెద్దకండ్లతో నవ్వింది అంటే శంకరన్ హృదయంలో మెరుపు మెరసినట్లు వుండేది. పెదవి తెరచి మాట్లాడింది అంటే ఏక్తారా మీటినట్లు వినేవాడు. బయలులో తిరిగి గారాబముగా పెరిగినపిల్ల కావడంచేత అంగసౌష్ఠవం బాగా వ్యక్తం అవుతూ వుండేది. తన మేనమామ కూతురు అవడంచేత శంకరన్‌కే ఆపిల్ల నిస్తారని అందరూ అనుకునేవారు. కాని వీరికి పెండ్లిండ్ల ముచ్చట యేమిన్నీ తెలియదు. అన్యోన్యప్రేమ దినదినమూ పెరుగుతూ వుంది. దినము సాయం

కాలమూ తప్పకుండా సముద్రతీరముపైన ఆరోటవాలు యిసుకదిబ్బల మీద ఆడుకునేవారు.

*   +

ఇట్లా కొన్నిసంవత్సరాలు గడచినవి. శంకరన్ ఇరువదియేండ్లవాడై నాడు. కుమారి ౧౬ యేండ్లదైంది. ఈనవయవ్వనంలో కుమారి సంపూర్ణ వికాసముకు వచ్చింది. ఆగులాబి రేకులవంటి పెదవులు, ఆనల్లని పెద్దకన్నులు ఆచూపులలో గాఢమైనప్రేమ, ఆ కిలకిలనవ్వులలో వెన్నెలతేట, ఆ మాటలలో అమాయకత్వము, ఆగంభీరమైననడక, ఆసుందరికొప్పు, ఆపొంకమైనవక్షస్థలము శంకరన్ మనసులో గాఢముగ నాటుకొనిపోయినవి. ఆకాలంలో మలయాళ స్త్రీలకు ఎదలపైన రవికలు గాని, కొంగు గాని లేకుండేవి. అందుచేత కుమారిసౌందర్యం మరీ ఆకర్షణీయమై, లోభనీయమై వుండేది. ఇట్లు వీరిరువురు పెరిగినా, తాము దినమూ ఆడుకునేఆటలు మానలేదు. ఆదిబ్బలపైన జారి తనమీద కుమారి పడినప్పుడు శంకరన్ తననే కాదు, ప్రపంచాన్నే మరచిపొయ్యేవాడు. ఆపడుచు చేయి పట్టుకొని రాత్రిలో ఇంటికిపోతూ వుంటే శరీరమంతా గగుర్పొడిచేది. కుమారికూడా శంకరన్ తొడపై తలమోపి పండువెన్నెల్లో పండుకున్నప్పుడు, తన ప్రియుడు ఆకథా యీకథా చెప్పుతూ యేదో మిష పెట్టుకొని వంగి ముద్దు పెట్టుకున్నప్పుడు తనశరీరములో రక్తము మహావేగంగా, ఉష్ణంగా ప్రవహించుతూ వుండేది. చెక్కిళ్ళపైన కాంతి రెండింతలయ్యేది. ఊళ్లో అమ్మలక్కలు వీరిద్దరి యీడూ జోడూ చూచి, వీరి అమాయికపు ఆటలుపాటలు చూచి చాలా ముచ్చటపడుతూ సావురాళ్ళజతలాగా వున్నారని అంటే యిద్దరూ ముసిముసినవ్వులు నవ్వుతూ వకరొకరు వంకచూపులతో చూచుకునేవాండ్లు.

ఒకనాడు సాయంకాలము ఇంటికి వస్తూవారిద్దరూ యిట్లా మాట్లాడుకొంటూ పోయినారు.

"కుమారీ, ముందు ఆదివారము మనకు పెండ్లంట గా! అత్తమామలు వాండ్లు పంపి శ్రీపతి యిల్లంతా అలంకారం చేస్తున్నారు."

"ఆసంగతి నాకూ తెలుసునులే!"

"దినము ఇంక అలుమగండ్లమైతే మనకు బ్రహ్మానందంగా వుంటుంది గదూ!"

"ఇప్పుడు లేదా? మన కెప్పుడూ నిత్యానందమే. మనము ఎప్పటివలె కలిసి వినమూ ఆడుకుంటాము గా!"

"లేదు. ఇంక మనకు అట్లాడే అవకాశం వుండదు. మన మింక ఇంటి పను లన్నీ చక్క బెట్టుకుంటూ సంసారం చేయవలసింది. నేను దినమూ చేపలు పట్టుక వస్తాను. నీవు యింట్లో పను లన్నీ చక్కబెడ్తూ ముసలి తల్లిదండ్రులకు సేవ జేయవలసి వుంటుంది."

"అట్లైతే నీవు నన్నింక ప్రేమించవూ?"

"ప్రేమించనూ? యెవ రంటారు? నిన్ను పూలల్లో పెట్టి పూజిస్తాను. అందరిచేతా పూజ జేయిస్తాను."

"ఏమో?"

"నేను పగలంతా చేపలు పట్టబోతాను. నీవు యింట్లో దంచీ, చెరిగి, వంట చేసి, యింటిపనులు చూసుకొని సాయంత్రమువరకూ సద్దీ, బుట్ట తీసి కొని సముద్రతీరానికి రావూ?"

"తప్పకుండా, గంటముందే వచ్చి ఇసుక మీన్నూ కూర్చుంటాను."

"మరి నేను పగ అంతా సముద్రంమీద వుంటే నీవు యింటిపనుల్లో నన్ను మరచిపోతావా?"

"ఎన్నటికీ మరవను అమ్మో! నిన్ను మరిస్తే ప్రపంచమే మరచినట్లు!"

*  *

శనివారమునాడు మధ్యాహ్నము భోంచేసుకొని కుమారిని వెంటబెట్టు కొని సముద్రతీరానికి శంకరన్ పోయినాడు.

రోదన చేయడ్చినారు. వచ్చిన చుట్టా లంతా అంగలార్చినారు. ఎవ్వరికీ తోచినట్లు వాళ్ళు ఓదార్చినారు.

"యిద్దరికీ ఒక్క బలం లేదు. ఏమి చేస్తాము?"

"యిద్దరూ పార్వతీ పరమేశ్వరులలాగా ముచ్చటగా వుండేవారు. పాపం!"

"వాడికి నొసటిమీద వుండే ఆ పెద్దమచ్చను చూచి ఎంత అదృష్ట వంతు డమ్మా అనుకొనే వాళ్లం!"

"ఎంత వినయవిధేయత లున్నవాడు!"

"శంకరన్ అంటే భోళాశంకరుడే నమ్మా!"

"ఇం కెక్కడి శంకరన్! అయ్యో! కుమారీ! మీ యిద్దరికీ యీనాటికి ఋణానుబంధము తెగిపోయె నమ్మా!"

అని నానావిధాల రొకరికి తోచినట్లు వారు వాపోయినారు.

కాని కుమారి మాత్రం ఒక్క కన్నీటిచుక్క రాల్చలేదు. ఒక మాట అనలేదు. ఒకవిధ మైన విషాదహాసంతో సముద్రం దిక్కే చూస్తూవుంది. ఎవరు పిలిచినా పలుకదు, అన్నము తినదు. ఆ చూపులో ఏదో వెదకులాట కనబడుతూ వుంది. వచ్చినబంధువు లంతా సాయంత్రంవరకూ ఎవరి దారి పట్టుకొని వారు పోయినారు.

ఆస్తమానం అద్యోనమయంలో యింత పప్పుకూర, ఇంత అన్నము, యింత పెరుగు, బుట్టలో తీసికొని కుమారి సముద్రతీరానికి పోయింది. ఎందు కమ్మా అంటే పలకదు. తల్లిదండ్రులు అడ్డు వచ్చినా వినదు. శంకరన్ తనను విడిచి యిప్పుడే వస్తానని చెప్పి కడసారి ముద్దుపెట్టుకొని కౌగిలించుకొన్న చోటికే పోయి నిలుచున్నది. అక్కడే సముద్రం దిక్కు చూస్తూ నిలబడింది. తల్లిదండ్రులు ఏమి ప్రమాద మౌతుందో అని వెంటనే వున్నారు. చీకటి పడ్డతర్వాత ఎంతో ప్రయాసతో యింటికి తీసుక వచ్చినారు. ప్రతి దినమూ సాయంకాలము బుట్ట పట్టుకొని కుమారి సముద్రతీరానికి పోయి

నిలుచుండి చీకటి పడిన వెంటనే తిరిగి యింటికి వచ్చేది.

"ఏ మమ్మా! ఇం కెక్కడి శంకరన్! ఇంకా వస్తా డనుకున్నావా? ఎందు కీవృధా శ్రమ?" అని తల్లిదండ్రులు కంట నీరు పెట్టుకొని అడిగితే-

"అమ్మా! నా ప్రియుడు, నా ప్రాణము, నా శంకరన్ తప్పక వస్తాడే! తప్పకుండా వస్తానని చేయిలో చేయి వేసి పోయినాడు!" అనేది కుమారి.

"ఓసి పిచ్చితల్లీ! ఇ దెక్కడి పిచ్చిఊహ నీకు!"

"లే దమ్మా! తప్పకుండా వస్తాడు. పోతూ పోతూ నన్ను మరచిపో య్యేవు సుమా అని చెప్పిపోయినాడు."

"వాడే నిన్ను మరచిపోయినాడే, తిక్కతల్లీ! యింక వాని ఆలోచన విడిచిపెట్టు."

"అట్లా కానే కాదు. అతడు నన్నెన్నటికీ మరచిపోడు. నన్ను పూలల్లో పెట్టి పూజిస్తా నన్నాడు. ఆ అలలవలెనే ప్రేమ అనంతము, అఖండము అన్నాడు."

"బిడ్డా, నీకు మతి పోయిందా ఏమి! వేరే మంచిమనువు చూస్తానులే. చింత చేయ వద్దు." అన్నాడు తండ్రి.

"నా శంకరన్ కంటే మంచివాడు ప్రపంచ మంతా వెదకినా దొరకడు. నా శంకరన్ తప్పకుండా వస్తాడు, నా పెండ్లి విషయంలో మీ రేమీ చింత చేయవద్దు. చిన్నప్పుడే మాకిద్దరికీ పెండ్లి అయ్యింది. నేనిట్లే యెదురు చూస్తుంటాను. మీ కిష్టం వుంటే ఇంత కూడు పెయ్యండి. లేకుంటే నేనూ సముద్రంమీదపోయి నా ప్రియుణ్ణి, నా భర్తను వెదుక్కొని కలుసుకుంటాను.

* *

కొన్ని రోజులు అట్లే గడిచిపోయినవి. కుమారి తల్లిదండ్రులు క్రమేణా చనిపోయినారు. కుమారి కిప్పుడు దిక్కెవ్వరూ లేరు. తల్లి దండ్రులు విడిచిపెట్టి పోయిన ఆస్తి కావలసినంత వుంది. దినమూ తపిస్తూ, శంకరన్‌కూ వంట వండుతుంది. సాయంత్రం పొద్దువరకు శంకరన్ రాకను

మూట కట్టుకొని సముద్రతీరం పోయి, తాము చిన్నప్పుడు ఆడుకొన్నచోట్లన్నీ తిరిగి చీకటి పడేవరకు శంకరన్ ఆఖరుసారి తనను విడిచిపెట్టి పోయిన తావుకు పోయి అక్కడ అన్నము పెట్టి యింటికి వస్తుంది. ఇట్లా దినాలు, మాసాలు, సంవత్సరాలు గడుస్తూ కుమారికి ౬౦ ఏండ్లు నిండినవి. ఈ రకం ఏండ్లనుండి అదే దినచర్య.

ఒకనాడు చాలా జబ్బు చేసి మంచం పట్టింది. కుమారి ప్రక్కయింటి నాయర్ స్త్రీ ఒకతె వచ్చి పరిచర్య చేస్తూ వున్నది. „అయ్యో! యీదినము శంకరన్‌కు అన్నము తీసుక పోలేదే. నీ వైనా తీసుక పోవూ? అతడు వచ్చేవేళ అయింది” అన్నది నాయరు స్త్రీతో. కుమారికి రెండవదినము జబ్బింకా జాస్తి అయినది. ఆమె పవిత్రవర్తనము, ఆ నిర్మలప్రేమ, ఆ అఖండభక్తి, ఆ అపూర్వ విశ్వాసము చూచి ఆమెకు భక్తితో నమస్కరించనివారే ఆగ్రామంలో లేరు. ఆమెకు రెండుదినాలు చాలా జబ్బైందని వినేవరకు చుట్టుపట్లవారంతా గుంపైనారు. పగ అంతా తీవ్రమైన తాపము, కలువరింతలు. ఆ కలువరింతలు అంతా శంకరన్ గూర్చిన కలవరింతలే.

„ఓహో! నీ వేముందు దొర్లిపోవాలె...

„మనకు పెండ్లయితే యెప్పటిలాగా ఆడుకోమా?...

„నన్ను మరిచిపోతావా శంకరన్?...

„లేదు లేదు, నీవు జల్దీ రాకుంటే వట్టు!...”

ఈ ప్రకారము కలవరించుతూ వున్నది.

సాయంత్రమైంది. అందరూ చుట్టూ మూగి ఉపచారాలు చేస్తూ వున్నారు. తటాలున కుమారి ముఖముపైన గొప్పకాంతి బయలుదేరింది. కండ్లలో ఆనందజ్యోతి ప్రజ్వరిల్లింది. ఎక్కడ లేనిబలం వచ్చింది. మంచములో లేచి కూర్చుని దక్షిణముఖంగా చూస్తూ చేతులు చాచి కుమారి

„ఆఁ వచ్చితివా, శంకరన్! జల్దీ వస్తా నంటివే! యిప్పుడైనా నన్ను

మరచిపోలేదు కదా! నన్ను రమ్మంటివా? వస్తా, వస్తా, యిదిగో వస్తున్నాను, వస్తున్నాను శంకరన్......"

అని మంచముమీద పడిపోయింది అందరూ నిశ్శబ్దంగా చూచేసరికి కుమారి శరీరం చల్లబడింది, కండ్లు మూసుకున్నది. ముఖముపైన చిరునవ్వుమాత్రము అట్లే నిలిచిపోయింది.

గ్రామస్థు లంతా, సర్వగ్రామంవారు ఆమెను శంకరన్‌తో కడసారి వీడ్కోలు పొందిన స్థలములో సమాధి చేసినారు. అప్పటినే ఒక గుడి కట్టినారు. అందులో అఖండక్షేమజ్యోతి వెలిగించినారు. నేటికీ కన్యాకుమారి దేవతయై ఆచోట పూజలు పొందుతూ వున్నది. "నిన్ను పూలల్లో పెట్టి పూజిస్తాను. అందరిచేత పూజ చేయిస్తాను" అన్న శంకరన్ మాటలు నిజమైనవి!

# పుట్టింటికి

శ్రీ వింజమూరి శివ రామా రావు

ఇరుగమ్మా పొరుగమ్మా సింగారించుకుని కచ్చేరీలనుంచి వచ్చేభర్తలకోసం ఎదురుతెన్నులు చూసేవేళ సరోజిని పశ్చిమాద్రి పక్కల మబ్బుల వెనకాల ఎక్కడికో చూస్తో నిట్టూర్చేది. ఇట్లా ముసలమ్మ "నీ మొగుడికి ఉద్యోగం కావడం, నువ్వు కాపరానికి వెళ్ళడం నా కళ్ళతో నేను చూడను..." అని ఊరికే ఎప్పుడూ సాధిస్తూంటే ఆ మెట్లగట్ల నీడ పెట్టుకుని తల వాల్చుకునేది. మగనిమీద జాలిపడుతూ, తనలో తాను విసుక్కుంటూ, అమ్మనీ చెల్లెళ్ళనీ కసురుకుంటూ రెండేళ్ళు పుట్టింటే గడిపివేసింది.

ఈరెండేళ్ళూ విశ్వప్రయత్నం చేశాడు ప్రభాకరం ఎక్కడైనా సరే మాస్టరీ దొరుకుతుందేమోనని. ఏ కాలేజీకీ, హైస్కూలికీ తన ఎం. ఏ. డిగ్రీ అక్కరకు వచ్చింది కాదు; ఏ అధికారీ, ఏ యజమానీ తన తెలివితేటల్ని లెక్కచేశారు కాదు. చివరికి అతను అలాగే నిరుద్యోగిగా, నిరాధారిగా నిలిచిపోయాడు. పిత్రార్జితం బాపతు హారించిపోగా మిగిలిన ఆ ఒక్క ఇల్లూ ఇంత అద్దె తెచ్చి ఇస్తూంటే దానితోనే పొట్ట నిండించుకుంటున్నాడు.

"ఏమైనాసరే! నే ఇంక ఇక్కడ ఒక్కగడియ ఉండను. ఆయనతో పాటు కలో గంజో కాచుకు తాగుతూ పడుండాలనిపిందే" అంది సరోజిని తండ్రితో. "అతను ఉద్యోగం లేక ఇబ్బంది పడుతున్నాడు గదా! నువ్వు కూడా ఎందుకమ్మా? ఇక్కడ నీ కేమి లోటని... కావలిస్తే అతన్నికూడా వచ్చి ఉండమందాం, ఉద్యోగం ఏదేనే అయేదాకా" అన్నాడు సరోజిని తండ్రి.

"ఆయన ఇక్కడికి వచ్చి ఉండరు నాన్నా! నాకు బాగా తెలుసు... వస్తే వెళ్ళను... ఎల్లకాలం ఒక్కతెగా ఉండదుకదా!" "చాలా బాధ పడతావు తల్లీ! బాగా ఆలోచించు. మీకు ఎత్తి పెట్టేటంత ఉన్నవాణ్ణి కాదుగదా..."

"ఒకరిచ్చేదేమిటి నాన్నా! ఎవరి మట్టుకు వారు సంపాదించుకోవాలి గాని. ఏమైనా సరే ఎల్లుండి నా ప్రయాణం తప్పదు" అని చెప్పి వంటింట్లోకి చక్కాపోయింది సరోజిని.

తనకే ఆ కాలేజీలో లెక్చరర్ పని అవుతుందని ఎంతో ఆశపడ్డాడు ప్రభాకరం, గాలిలో ఎన్నో మేడలు కట్టుకున్నాడు; కాని సమయానికి ఆ అరనాయన అడ్డు వస్తాడని అతను కలలోకూడా అనుకోలేదు. అదే చింతతో కూర్చున్న అతనికి ఇంటిముందు బండీ ఆగిన అలికిడి వినిపించింది. అతను లేచేసరికి ఎదురుగా సిగ్గుతో, కొంచెం భయంగా, నిలబడి వుంది సరోజిని, తల వాల్చుకుని...

ఒక్క సంవత్సరం ప్రణయరాజ్యాని కేలికలై కాపరం చేశారాయిద్దరూ. అతని ఉద్యోగం కాలేదే అని బెంగ అమెకూ, ఆమెనికమీద ఎలా పోషించేదీ అనే దిగులు అతనికీ లేకుండా ప్రపంచాన్నే మరచిపోయారు ప్రేమలోపడి. ఆమె పుట్టింటినుంచి తెచ్చుకున్న సొమ్మంతా అయిపోయిందనే సంగతికూడా వారు గమనించలేదు కొంతకాలంవరకూ. తెలుసుకున్న తరువాత ఇద్దరికీ గుండెలు కొట్టుకున్నాయి, రోజులు గడిచే దెలాగరా అని, ఆమె ప్రోత్సహించింది. అతడు దీక్షవహించాడు; ఏదైనా నౌకరీ సంపాదించాలని. కాని ఇచ్చేదెవరు?

ఒకనాడు మధ్యాహ్నం ఎండలో చెమటలు కక్కుకుంటూ ఇల్లు చేరుకున్నాడు ప్రభాకరం. గుమ్మంలోంచి ఏమైందని ఆత్రంతో అడిగింది సరోజిని. అతడు మడతకుర్చీలో వెన్ను వాల్చి నిట్టూర్చి "తెనుగువాడికి బంట్రోతువనికూడా దొరకదు. ఏ తెనుగుసంస్థా అభివృద్ధి చెందడానికి

విలువ లేదు. ఏ తెనుగు కళా తలెత్తుకు సంచరించుకు తావు లేదు. ఏ తెనుగు వ్యక్తి ఉద్యోగస్థుడవుతాడనే ఆస లేదు. ఎప్పటికైనా ప్రత్యేకాంధ్రరాష్ట్రం వస్తే ఏమో గాని, లేకుంటే ఆంధ్రజాతి కధోగతే ఇంకముందు…” అన్నాడు.

“నరేగాని లేచి స్నానం చెయ్యండి; వంట అప్పుడే చల్లారిపోయింది” అని సరోజిని ప్రభాకరాన్ని లేవదీసింది. భోజనం చేస్తూంటే అతడామెతో “పోనీ, ఒకటి రెండు నెలలపాటు నువ్వు మీ పుట్టింటికి వెళ్ళి రాకూడదూ! ఈలోగా నేను ఎక్కడైనా, ఏదన్నపనైనా సంపాదించుకుంటా” అన్నాడు. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. అది చూచి మళ్ళీ అతడా ప్రశంస తేలేదు.

ఇల్లు తాకట్టుపెట్టి సొమ్ము తీసుకువచ్చాడతను. ఇంటిలోకి కావలసిన వన్నీ పద్దురాసి తెప్పించిన దామె. ఒకరి నొకరు హెచ్చరించుకుంటూ, అనునయించుకుంటూ ప్రేమలో కొంతకాలం గడిపేశారాయిద్దరూ. ఆ సొమ్ము కాస్తా అయిపోయింది. ఉద్యోగం కోసం ఆమె వెయ్యిదేవుళ్ళకి మొక్కుకుంది; అతడు శతవిధాల ప్రయత్నం చేశాడు. కాని ఏ దేవుడికీ హృదయం కరగ లేదు; ఏ ప్రభువుకీ బుద్ధి పుట్టలేదు.

ఒకనాటి రాత్రి ప్రొద్దుపోయి ఇంటికి వచ్చాడు ప్రభాకరం. మంచి ఆకలితో నీరసంగా పడుకున్న సరోజిని నెమ్మదిగా లేచి అతని మొహం వంక చూచి “పని కాలేదు కాదూ” అనె. “ఎలా అవుతుంది? ఆంగ్లోఇండియన్లు చిన్నపనులు మాత్రం చేయలేరో? … … నీ భోజన మైందా “అన్నాడు, “వంట కూడా కాలేదు … కావడానికి ఇంట్లో ఏమీ లేవు…” అతడు లేనినవ్వు తెచ్చుకుని, ఆమెను ముద్దు పెట్టుకున్నాడు ఆమె లేనిసత్తువ తెచ్చుకుని అతని మెడ చుట్టూ చేతులు పెనవేసింది. పడుకుని ఉండగా— “పోనీ ఒకటి రెండు నెలలు పాటు మా పుట్టింటికి వెళ్ళి వస్తాను. ఈలోగా మీ కేమైనా పని కుదురుతుందేమో” అంది ఆమె. అతని మొహం ఎర్రగా అయిపోయింది. అది చూసి మళ్ళీ ఆమె ఆనంగతి ఎత్తలేదు.

ఆమె ఒంటిమీద వెండిబంగారాలు క్రమక్రమంగా మార్వాడీదొకాణి పాలయ్యాయి. అతని ఇంటిలోని పాత్రసామాను ఒక్కొటొక్కటీ సాహుకారి వడ్డీ కింద చెల్లుబడి అయినాయి. ఆమె లోలోపల కుమిలి పోతూనే ఉంది. అతడు ఎక్కడెక్కడికో పోయి అడుగుతూనే ఉన్నాడు. కాని ఎక్కడా కలిసిరావడం లేదు. చివరికి ఆ ఇల్లు కూడా అమ్మకోవలసినగతి పట్టింది, పొట్టకోసం; ఇంక నిలవ నీడకూడా లేదు. ఏపూట కాపూట తిండి కెలాగా అనే దిగులే!

"మంచి సినిమాలు — ఊరంతా వెడుతున్నారు — మనంకూడా వెడదామా? చాలారోజులైంది టాకీ చూసి—" అంది సరోజని. "డబ్బేదీ? అప్పుకూడా ఎవరూ ఇయ్యరు నాకు. ఉద్యోగం అవనీ; రోజూ వెడదాం" అన్నాడతను.

"పండగ గదా! బొబ్బట్లుచేసి పెడుదూ — తినాలని ఉంది, చాలా రోజులైంది కూడా నువ్వు బొబ్బట్లు చేసి" అన్నాడు ప్రభాకరం.

"ఏమి పెట్టి చేసేది? అప్పుసైతం దొరకనాయె. ఉద్యోగం అవనీండి—కావలసినన్ని" అంది ఆమె.

ఇంక ఏదారీ లేక మామగారికి ఉత్తరం వ్రాశాడు ప్రభాకరం, ఏమైనా సాయం చేయవలసిందని, జవాబు లేదు. సరోజనికూడా వ్రాసింది, ఉద్యోగం కాగానే నెలనెలా ఋణం తీర్చుకొంటామని. పంపడానికి ఏమీ తనవద్ద లేదనీ, వచ్చి తనయింట్లో ఉంటే తన కేమీ అభ్యంతరం లేదనీ జవాబు.

దారిద్ర్యం, నిరుద్యోగం కలిసి, కుట్రచేసి ఆ దంపతుల్ని పిశాచాల్లాగ పట్టుకుని పీడించడం మొదలు పెట్టాయి. ఎక్కడకు వెళ్ళినా పరువులేదు; ఏపని చేసినా మెప్పులేదు. ఎర్రబడిన కళ్ళతో, పెరిగిపోయిన గెడ్డంతో, మాసిపోయిన బట్టలతో తిరిగే ప్రభాకరాన్ని చూసి, ఉద్యోగం ఇయ్యక పోయినా, ఇదివరకల్లా మర్యాదగా మాట్లాడే అధికారి అతనివంక చూడ

నైనా చూడలేదు. చిక్కిపోయిన చెక్కిళ్ళతో, రేగిపోయిన తలకట్టుతో, చినిగిపోయిన చీరతో వచ్చే సరోజిని చూచి అవ్వ ఇయ్యాలపోయినా ఇంతవరకూ జాలిగా పలకరించే వక్కాయింటామె తలుపు వేసికొని లోనికి చక్కాపోయింది.

క్రమక్రమంగా అతనికి చిరాకు ఎక్కువైపోయింది. ఆమెకు ఓరిమికూడా తగ్గిపోయింది. అయిన దానికీ కాని దానికీ అత డామెను తిట్టడం మొదలు పెట్టాడు. ఊరుకోకుండా ఆమె అతణ్ణి ఎదిరించడం మొదలు పెట్టింది. అతడు కాస్త చేయి చేసుకోవడం, ఆమె పనులన్నీ మాని వేసి ఏడుస్తూ పడు కోవడం మామూలైపోయినాయి. పండంటి కాపరానికి దారిద్ర్యం, నిరు ద్యోగం చిచ్చుపెట్టాయి—

ఆదరవు ఏమీ లేదనే కోపంతో అన్నంకూడా వండకుండా పడుకుంది సరోజిని ఒకనాడు. ప్రభాకరం అదిచూసి ఆమెను నాలుగు తన్నాడు.

"పెట్టేదీ లేదు, పోసేదీ లేదు, కొట్టడంకూడా ఎందుకు? ఇష్ట ముంటే ఇలా ఉండనీయండి; లేకుంటే పుట్టింటికి పోతాను" అనేసిం దామె. "పోతే పో! ఇక్కడ నిన్ను కట్టిపెట్టిం దెవరు? తని విరగడై పోయిం దను కుంటాను" అనేశా డతను గట్టిగా.

మాష్టరీపని ఒకటి ఖాళీ అయిందనీ, ప్రభాకరం వస్తే ప్రయత్నం చేస్తా ననీ ఒక స్నేహితుడు తనపేర వ్రాస్తే, భార్యమెడలో మిగిలివున్న పుస్తె అమ్మేసి, అతను ఊరికి వెళ్ళాడు. కాని ఒక బెంగాలీబాబుక అపని అయి పోయింది. ఈ తెలుగువాడు మళ్ళీ నిరుద్యోగే!

తాను తిండికీ గుడ్డకీ లేక అవస్థపడుతున్నాననీ, వెంటనే రాకపోతే ప్రమాద మనీ సరోజిని తండ్రిపేర ఉత్తరం వ్రాస్తే, ఆయన వచ్చి ఆమెను ఎవరితోనూ చెప్పకుండా తీసుకుపోయాడు. ప్రభాకరం ఇంటికి వచ్చి చూచేసరికి తన సూటుకేసు ప్రక్కన సరోజిని కావడిపెట్టె కనబడ లేదు. ఎదురుగా గూట్లో ఆమె బొట్టుపెట్టె లేదు.

ఇల్లూ, వాకిలీ లేక, తోలు పీలికలు మొలకు చుట్టబెట్టుకుని పిశాచగణంతో భిక్షాటనం చేసి వచ్చి, ఒకరినొకరు వదలకుండా ఉమామహేశ్వరులు ఆనంద నృత్యం చేసే ఆ సంజవేళ, చెదరిపోయిన పక్కమీద వాడి పడి ఉన్న జాజిపూవుల వంక రెప్ప వాల్చకుండా చూస్తూ కూర్చున్నాడు ప్రభాకరం.

ఆ ౬ 3 ౫

# బాకీ

శ్రీ మునిమాణిక్యం
నరసింహా రావు

౧

"నా మాట వింటే ఇంతవరకు రాదు అన్నయ్యా! ఆ వచ్చిన అత్తై నా చేతులో పడేస్తే, కానీ అప్పు లేకుండా జరుపుతాను అంటే వింటేనా ఆయన!"

"నేను చెప్పా నమ్మా! నీకు వచ్చిన జీతం జీతం అమ్మాయికి ఇచ్చేయరా; ఆడ వాళ్ళు మనకంటే పొదుపుగా వాడుతారూ అని చెప్పా నమ్మా!"

"మీరే కాదు అన్నయ్యా! అంతా చెప్పారు. వింటేనా? చూస్తున్నారుగా సంగతి అంతా! బియ్యం వాడికి యాభై రూపాయలు ఇవ్వాలి, ప్రొద్దున్న ఆయన వచ్చి కేక వేసి వెళ్ళాడు. నేను వంట ఇంట్లో ఉన్నాను అవ్వసం. చెయ్యి ఊరుకో లేదు. లేకపోతే వచ్చి, అప్పు పెట్టినందుకు ఆయనను నాలుగు చీవాట్లూ వేసేదాన్ని."

"వాణ్ణి చీవాట్లు వేస్తే ఏం లాభం అమ్మాయీ! మన బంగారం మంచిది కాకపోతే కంసాలి ఏం చేస్తాడూ!"

"బాగా అన్నారు! ఇల్లాగ వచ్చే పై తెలియకుండా ఖర్చు చేస్తే ఎన్నాళ్ళని గడుస్తుం దంటారూ!"

"నిజమే మరి!"

"నిజ మని మెల్లిగా అంటా రేమిటి? ప్రస్తుతం మీరూ మేమూ కలిసి ఉన్నాము కాబట్టి ఏ మున్నా, ఏం లేకపోయినా, ఇబ్బంది అంటూ కనపడటంలేదుగాని రేపు వేరుపడి కాపురం పెడితే తెలిసొస్తుంది అయ్యగారికి!" అన్నది మాబావమరది భార్య విసుగుతో.

"ఎల్లకాలం ఇల్లాగే ఎందు కుంటుం దమ్మా! ఏదో చిన్నతనం ఇంకా నాలుగేండ్లు గడిస్తే వాడికే వస్తుంది జ్ఞానం!" అన్నాను నేను.

నిజానికి వాడిని గట్టిగా చీవాట్లు వేయటానికీ వీలు లేదు. అరవై రూపాయలు వస్తున్నాయి రావటానికి. కాని అందులో నెలకు ఓ ఇరవై రూపాయలు ఇంటి దగ్గ రున్న తల్లి దండ్రులకు పంపుతున్నాడు. మొగుడూ పెళ్ళానికీ మిగిలిన నలభై సరిపోవలసిందే. కాని- ఏదో చిన్నతనం చేత బట్టలకూ, వాటికీ, కాస్త ఎక్కువే ఖర్చు చేస్తున్నాడు. సంవత్సరానికి రెండు వందల రూపాయలు వచ్చే సదుపాయం ఉందికదా, అప్పు కాస్త అయితేమట్టుకు ఏమి, తీర్చుకో లేకపోతాడో అని నేనూ ఊరుకొన్నాను. ఎవ్వడో వచ్చి నష్టూడు ఇస్తా నంటే వర్తకులు ఊరుకోరు. అందుచేత అంతవరకూ అగటానికి వీలు లేదంటూ బియ్యపు వర్తకుడు మావాడిని వేధిస్తూ ఉన్నాడు. దానితరువాత తీసుకోవచ్చు వాడికి సమయానికి కాస్త సహాయపడితే దామని నేను అనుకోటం అనుకొంటాను. కాని అనుకోటంతోటే సరి! ఇద్దామంటే ఉండేది కాదు. వంద రూపాయలు తెచ్చుకొంటున్నా నా సంగతి అంతకంటే అధ్వాన్నం. వాడి కింకా కాస్త అప్పు అయినా పుడుతుంది. నాకు అది లేదు. అయితే నాది పెద్ద సంసారం. పిల్లల చదువులకూ వాటికీ ఖర్చు లున్నాయి. వాడికి ఏమీ బాదరబందీ లేదు. వాడూ కాస్తో, కూస్తో వెనకేయ వచ్చు. అందుకని ఈతభా వాడికి కాస్త గట్టిగా చెప్పా లనే అనుకొన్నాను.

ఆరోజు మధ్యాహ్నం భోజనా లైనతరువాత మావాడితో ఈప్రసంగం ఎత్తి, అప్పుల వాళ్ళు మన ఇంటిచుట్టూ తిరగటం మన కేమీ మర్యాదగా

లేదురా నాయనా! నీవు ఎక్కడైనా తెచ్చి అయినా సరే ఆ బియ్యం బాకీ తీర్చి వేసెయ్యి అని కోప్పడ్డాను.

"నిజమే బావా! దరిద్రంగానే ఉంది. వారం రోజుల్లో ఈ బాకీ తీర్చేస్తాను" అన్నాడు. "తీర్చే సెయ్యి. తీర్చే ఇక మీదట, నీకు వచ్చే జీతం, జీతం అమ్మాయికి ఇస్తుండు. ఆడవాళ్ళు వాడినంత పొదుపుగా మనం వాడలేము" అన్నాను. అమ్మాయి వింటూ ఉండంగానే వాడు భార్య వంక చూచి ముసిముసి నవ్వులు నవ్వుతూ "అల్లాగే బావా, నీవు ఇంతగా చెప్పక్కర లేదు. తప్పకుండా అల్లాగే ఇస్తాను" అన్నాడు. వాడిభార్య "ఆ అన్నీ ఇచ్చారు! ఎన్నిసార్లు అన్నారు ఇల్లాగ" అని ముక్కూ మూతీ విరిచింది.

౩

ఆ తరువాత రెండుగంటలకే వాడు టకటకా ముస్తాబై ఎక్కడికో బయలుదేరుతున్నాడు. ఎక్కడికీ అని అడగటం మంచిది కాదు, కాబట్టి ఊరికే సందేహంతో నవ్వుతూ వాడివంక చూశాను. అవికారపు చూపుల్లో నా ప్రశ్న బయటపడ్డది. వాడూ ఆ సంగతి గ్రహించాడు.

"ఇవ్వాళ మా బ్యాంకి అధికారి నాలుగుగంటల బండిలో వస్తాడు బావా. నేను వెళ్ళి రిసీవ్ చెయ్యాలి" అన్నాడు మావాడు.

"అయితే నాలుగుగంటల బండిలో వచ్చే ఆయనను రిసీవ్ చేయటానికి రెండు గంటలకే బయలుదేరాలా?" నా ప్రశ్న విని వాడు పకపకా నవ్వి, దానికో కారణం ఉంది బావా అన్నాడు.

ఒకటేం రెండు ఉన్నాయి అన్నయ్యా అన్నది వాడిభార్య నవ్వుతూ. ఇద్దరూ పకపకా నవ్వుకొన్నారు. ఎందుకో నాకు అర్థం కాలేదు.

"ఏం లేదు బావా, మూడు గంటలకు ఓ టీ పార్టీ ఉంది. అంగ్లా

ఇన్సూరెన్సు పోలసీలో" అన్నాడు వాడు. "ఆ, ఆ, ఎందుకండీ అగోడ వంతా? అసలు సంగతి చెపితే ఏం?" అన్నది వాడి భార్య.

మా వాడు భార్య వంక తిరిగి, అసలు సంగతికి ఏముంది అంటూ, ఇదిగో, ఇది చూడు బావా అని ఓ ఎగ్రిమెంటు కాగితం నాకు అందించాడు. నేను చూచి నవ్వుతూ, నిజమే నమ్మా! టీ పార్టీ మాట నిజమే, అన్నాను.

టీ పార్టీ మాటంటే సరే గాని రెండింటికే బయలు దేరటానికి కారణం ఏమిటో అడుగు అన్నయ్యా! అన్నది కనకం విరగబడి నవ్వింది. "నేను అడగటం ఎందుకూ, వాడే చెబుతాడు—" అన్నానేను.

చెప్పటానికి మరేం లేదు బావా. టీపార్టీ కాబట్టి ముందుగా వెళ్ళటం కొన్నైనా మంచిదని వెళుతున్నాను. అంతే, అని భార్యను చూచి ముసిముసి నవ్వులు నవ్వాడు.

"అది కాదండీ అన్నయ్యా, రెండున్నరకు బియ్యపు వర్తకుడు వస్తాడు. వస్తానని చెప్పి వెళ్ళాడు లెండి. అందుకని హడిలిపోయి పారిపోతున్నారు" అని నిజం కాస్తా బయట పెట్టింది.

మా వాడు భార్యను కోపపడలేదు. "హడిలిపోవటం కాదు బావా వారం రోజుల్లో ఎట్లాగూ వస్తుంది. ఇచ్చేస్తాను ఏదో ఈ నాలుగు రోజులూ వాడి కళ్ళ బడకుండా ఉందాం అని చూస్తున్నాను. అంతే:" అన్నాడు. "అయితే మట్టుకు ఇప్పుడు పారిపోవటం భయపడి కాదా?" అన్నది అమ్మాయి. వాడు మాట్లాడలేదు. అమ్మాయి ఊరుకోక "ఎందుకండీ, అంత అభిమానం? మీ బావదగ్గర కూడాను" "ఆయన వస్తున్నాడూ, ముఖం తప్పిస్తున్నాను అని చెప్పరాదూ?" అన్నది.

"చెప్పేదేమిటి, బావకు తెలియదా? అది కాదు బావా, వారం రోజులలో ఇస్తానంటే వాడు ఎందుచేతనో ఆగటం లేదు. ఎప్పుడూ ఇల్లాగ కాదు. ఈ తడవ ఎందుచేతనో జీడిలాగ పట్టుకొని వదలకుండా ఉన్నాడు.

అందుకని ఈ నాలుగు రోజులూ వాడికి కాస్త కనపడకుండా ఉందా మనే అనుకుంటున్నాను.'' అన్నాడు మావాడు.

''అదా సంగతి? రెండున్నరకు ఆయన వస్తా డని ముందుగా వెళ్ళి పోతున్నావూ? అయితే ఒక్క సంగతి. ఆ వచ్చిన ఆయన నీవు వచ్చే టంతవరకూ ఇక్కడే కూర్చుంటాను అంటాడను? అప్పు డేమిటి గతి?'' అన్నాను. ఇల్లా జరగవచ్చు నని వాడికి అంతవరకూ తట్టలేదు కామాలు, ఈమాట విని మావాడు తెల్లపోయినాడు.

తెల్లపోయి, ''నిజమేను బావా! ఎట్లా? వాడు అల్లా చేస్తే చెయ్యవచ్చు. ఒక తీరాన వదలటంలేదు. తీరా నేను అధికారిని వెంటబెట్టుకొని వచ్చేసరికి ఈదరిద్రుడు తయారవుతాడు కామాలు'' అని అంటూ దిగాలుపడి నుంచున్నాడు.

''ఆయనకు తోచక పోయినా నేను చెప్పి అయినా సరే కూర్చోబెట్టక పోతే చూడండి'' అని అమ్మాయి వెక్కిరించింది.

అమ్మాయి నవ్వుతూ అన్న ఈమాట, వాడిని కష్టపెట్టింది. అందుకని వాడు వినుక్కొని ఏమీ జవాబు చెప్పలేక నావంక దీనంగా చూశాడు.

''ఏంరా, అల్లాగ దిగులుపడతావూ? అప్పు లున్నయ్యి అని ఆయనకు తెలుస్తుంది! తెలిస్తే నీకు వచ్చిన కష్టం ఏముందీ? ఆయనకు మట్టుకు అప్పులు ఉండవా?'' అన్నాను.

''అల్లా కాదు బావా, నేను ఏదో డబ్బు గలవాడిని అయినట్లూ, ఘరానాగా బతుకు తున్నట్లూ ఆయనకు మొదట్లో అభిప్రాయం కలుగ జేశాను. ఇప్పుడు ఈవిధంగా నాబతు కంతా బయటపడ్డదా నాకు మర్యాద ఉండదు!'' అన్నాడు.

ఈ మాట మీద అమ్మాయి అన్నదీ... ''అయితే మీ బావ ఏం చేస్తారూ, మీరే ఉండి, ఆయనకు ఏదో మంచిమాట చెప్పి పంపించి మరీ వెళ్ళండి''

ఈసలహా మావాడికి నచ్చ లేదు. అందుకని వాడు నాతో అన్నాడు, “అది కాదు బావా, నేను కనపడితే ఆయన వదలడు నువ్వే ఏదో కాస్త మంచిమాట చెప్పి పంపివేయాలి.” ఆ అనటం కూడా బతిమిలాడే పద్ధతిలో అన్నాడు.

“సరేలే, నే నేదో చెప్పి పంపిస్తానులే. నీవు వెళ్లు” అని అంటూ వాడ్ని పంపించాను. వాడు వెళుతూ “బావా, నీకవిత్వం అంతా ఉపయోగించి ఈపీడ వదిలించాలె సుమీ నేను నాలుగున్నర కల్లా మా అధికారితో వస్తాను” అని చెప్పి భార్యతో, ఫలహారం కాఫీకూడా సిద్ధంచేయమని పురమాయించి వెళ్ళిపోయినాడు.

నేను కాస్సేపు పడుకొని, విశ్రాంతి తీసుకొని వాకిట్లోకి వచ్చేసరికి ఎవరో ఒకాయన మాయింటికి వస్తున్నాడు. అప్పుడు యూహ అయింది. ఆ వచ్చే ఆయన నల్లగా పొట్టిగా ఉన్నాడు. బట్టలు మాసి ఉన్నాయి. మాడు కాలేదు, అప్పుడే వస్తున్నాడు, పరపోయినట్లు అనుకొని చూస్తూ, నిలుచున్నాను. ఈసాహుకార్లు ఎండా వానా అని చూడరు. పప్పుడు బడితే అప్పుడు వస్తారు. నిద్రాహారాలు ఉండవు కాబోలు. అనుకుంటూ అక్కడే నిల్చున్నాను.

ఆయన యీకాయకీని సరిగ్గా గడపలోకి వచ్చి, నన్ను తేరిపార జూచి “నారాయణమూర్తి గారు ఉన్నారా అండీ?” అని అడిగాడు. “లేరు” అన్నాను.

ఈమాట విని ఆయన నిలువునా నీరై పోయినాడు. ఆకాశం విరిగి మీద పడ్డట్లు నిశ్చేష్టతపోయి నిలబడ్డాడు. అనుకున్న సమయానికి పేరం అందకపోతే కొంప కూలినట్లు నటించటం వర్తకులకు ఉండే సహజ గుణమే కదా అనుకొన్నాను. తనసొమ్మంతా హఠాత్తుగా సముద్రంలో మునిగి పోయినవాడు సహితం అంత విచ్ఛిన్నముఖం పెట్టడు. ప్రాణం మీదకి వచ్చిన వాడిలాగ గుడ్లు తేలేశాడు. వాటర్లూ యుద్ధంలో ఓడిపోయిన

నెపోలియన్ సహితం అంత బేజారై ఉండడు ఆయన్ను చూస్తే నాకు పరమ అసహ్యం వేసింది.

కాస్సేపటికి ఆయన తెప్పరిల్లి "ఎక్కడికి వెళ్లా రండీ?" అని అడిగాడు. "బైటికి వెళ్ళాడండి" అన్నాను.

ఆయన ఒక్క క్షణం అల్లాగే నిలబడి చివరకు "ఎక్కడికి వెళ్ళి ఉంటాడండీ? నేను వస్తానని ఆయనకు తెలుసునే, ఎందుకు ఇల్లాగ వెళ్ళిపోయినాడో" అని తనలో తాను అనుకొన్నట్లు అనుకొని, మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలాగ చూచి ధైర్యంతో "సరే లెండి. ఇంకా కాసేపట్లో వస్తా డనుకొంటా" అని జేబు గడియారాన్ని పైకి తీస్తున్నాడు.

"మీరు వస్తారని తెలిసే, మీకు కనపడకుండా ఉండాలనే వెళ్ళిపోయినాడు." అని గబుక్కున నోరుజారి అనేశాను. అన్న తరువాత విచారించాను, అయ్యో ఎందుకంటినా, అనవసరంగా పెద్దమనిషి మనస్సు నొప్పించానే అని.

పాపం ఆయన తెల్లపోయి, "ఎందుకండీ, ఏమంత ఖర్మం! అంత పారిపోవలసిన అవసరం ఏమీ లేదే!" అన్నాడు. "భయం కాదు టండీ, అప్పుల వాళ్ళను చూచినా అధికారులను చూచినా?" అని నేను అన్నాను, కాని ఆయన ఏమీ తృప్తిపడ్డట్టు కనపడలేదు. పైగా ఆయన ఆహ్వానం లేకుండానే లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. మావాడు భయపడ్డట్టుగానే అయింది. ఇక ఆయన వదిలేటట్టు లేదు. మీరు వెళ్ళండి నేను టైంపు చేసుకొంటాను. అని అంటానికి నాకూ నోరు రాలేదు. నేనూ మరో కుర్చీలో కూర్చుని, పేపరు చదువుతూ ఉన్నట్టు నటిస్తూ, ఆయనను సాగనంపటానికి మార్గం ఏదా అన్న ఆలోచనలోకి దిగాను.

బల్లమీద పుస్తకాలూ, పత్రికలూ, అవీ చాలా ఉన్నాయి. ఆయన ఒక ఇంగ్లీషు మాసపత్రికను లాగి పేజీలు తిరగేసి, చివరకు ఏదో చదువుతూ ఉన్నట్టు మొహానికి అడ్డంగా పెట్టాడు. మొదట ఆయన బొమ్మలకోసం

పేజీలు తిరగేశాడు అనుకొన్నాను గాని చివరకు ఆయన ఏదో చదువుకొంటున్నట్లు తోచింది. ఏదో మూడో ఫారం పాఠాలు చదువుకొని ఉంటాడు. పైకి చదవండి, నేనుకూడా వింటాను అని అందామని అనుకొని మరీ ఏడిపించినట్లు అవుతుందని ఊరుకొన్నాను.

నేను అనుకున్నట్లే అయింది. ఆయన చదువుతూ ఉన్నట్టు నటన చేస్తున్నాడని తేలిపోయింది. ఎందుకంటే, పదినిమిషాలు కాకముందే, ఆయన పుస్తకాన్ని బల్లమీద పెట్టి పైకీ, కిందికీ చూడటం సాగించాడు. ముందు ఆయన దూలాలూ, అడ్డకడ్డీలూ లెక్క చూసుకొన్నాడు. దాని తర్వాత దర్వాజాలు లెక్కేసుకొన్నాడు. ఆపైన కిటికీలు ఎన్ని అయిందీ, ఒక్కొక్క కిటికీకి ఎన్నిచువ్వలు ఉన్నదీకూడా చూసుకొంటూ ఉంటే నాకు నవ్వొచ్చింది.

కాసేపు ఇల్లాగ చూచి, పాపం, ఆయన చివరకు, నావంక జాలిగా చూస్తూ అడిగాడు, "ఏమండీ, ఎక్కడికి వెడతా నని చెప్పి వెళ్ళాడండీ?" అని అల్లాగ అడుగుతూ ఉన్న పెద్దమనిషికి (బియ్యపువర్తకు డయితే నేం!) మర్యాదగా జవాబు చెప్పకపోవటం తప్పు అని తోచింది నాకు. అందుకని ఉత్తఫా నేను మర్యాదగానే జవాబు చెప్పాను. ఆంధ్రభాషా న్యూసెన్సు హాలులో ఏదో టీపార్టీ ఉందని వెళ్ళాడండీ అని.

"ఎన్నిగంటలకండీ, ఆటీపార్టీ?" అని అడిగాడు ఆయన. ఏమో నాకు తెలియదండీ అన్నాను నేను. ఆయన,- నేను వస్తా నని తెలిసీ ఎందుకు వెళ్ళాడబ్బా! అని గొణుక్కొని అయితే, ఎప్పుడు వస్తా డని మీ అభిప్రాయం? అని అడిగాడు.

దొరికాడురా అనుకొన్నాను. ఆయనను పంపించెయ్యటానికి ఏదోమాట అనవలసిన సమయం అదే నని నిశ్చయించుకొని- ఎప్పు డొస్తాడో చెప్పలేమండి. రాత్రికే గాని ఈమధ్య రాడు. అసలైనా రాత్రి పదకొండింటికి వస్తాడు, రావటం అంటూ ఉంటే. ఒకప్పుడు అదీలేదు. నమ్మకంగా చెప్ప

అధికారి! అట్లా ఉన్నారేం ఊసురో మంటూ!" అన్నది. అధికారులు అట్లాగే ఉంటారమ్మా! అని నేను అన్నాను. నేనూ లేచి మళ్ళీ కిటికీలో నుంచి చూశాను. అమ్మాయి అన్నమాట నిజమే. ముగ్గురూ వస్తున్నారు. జవాను పెట్టె నెత్తిన పెట్టుకొని ముందు నడుస్తున్నాడు. ఆయన వెనకాల అధికారి, ఆ వెనకాల మా వాడూ కనిపించారు.

అధికారి వస్తున్నాడని నిశ్చయించుకొనే సరికి తోటియ్యావు వర్తకుడు ఇంకా అక్కడే ఉన్నాడేమో నని సందేహం వేసింది. తలుపు తీసి చూశాను. అక్కడే శిలావిగ్రహంలాగ నిలబడి ఉన్నాడు. వాళ్ళవంక చూస్తూ.

అధికారి ఎదటే తన బాకీ విషయమై మా వాడిని నిలవేసి అడుగుతాడేమో నని భయం వేసింది. అందుకని గబగబా వీధిలోకి పోయి, ఆయన్ను వెనక్కి పిలిచి "చూడండి, మా వాడున్నూ, వాడున్న బ్యాంకి అధికారిన్నీ వస్తున్నారు. మీరు బాకీ సంగతి ఇప్పుడు ఎత్తకండేం!" అని బతిమిలాడాను.

"ఎవళ్ళు! ఆమాత్రం నాకు తెలియకుండా? వస్తున్నారు కదా, ఒకమారు కనపడి నమస్కారం చేసి వెడదామని ఉన్నాను." అంటూ ఆయన వెకిలిగా నవ్వాడు. "మీ బాకీ, నాలుగు రోజుల్లో తీర్చే ఏర్పాటు నేను చేస్తాను. మీరు వెళ్ళిపొండి" అని ఇంకోమాటు ఆయనకు గట్టిగా చెప్పి, నేను గబగబా ఇంట్లోకి వచ్చేశాను, కుర్చీలూ అవీ, సర్దటానికి.

పెద్దమనుష్యులను రిసీవ్ చేయటానికి తగినపద్ధతిలో కుర్చీలుసర్ది వాకిట్లోకి వెళ్ళేసరికి మా వాడు ఎదురై గబగబా నడుస్తూ ఒక్కొక్కలో వచ్చారు బావా- అంటూ లోపల అడుగు పెట్టారు. నేను అక్కడే నుంచుని అవతలివైపు తిరిగి వెళ్ళండి అని సంజ్ఞ చేశాను.

నామాట వినకుండా ఆయన మళ్ళీ ఇంట్లోకి ప్రవేశిస్తూ మా వాణ్ణి అడిగాడు రమ్మంటారా అని. మా వాడు ఆయనకు ఎదురుగా వెళ్ళి, వినయంగా

నమస్కరించి, నేను తమకోసం క్లబ్బుకు వెళ్ళాను. మీరు వారంలో ముందుగా వచ్చారని గుమాస్తా చెప్పిందాకా నాకు తెలియనే తెలియదు" అన్నాడు.

"తమరు వచ్చి చాలా సేపు అయిందా? ఏమీ అనుకోకండి! క్షమించండి" అంటూ హైరానా పడటం చూసి నేను నిర్ఘాంతపోయాను. స్టేషనునుంచి మా వాడితో వచ్చింది గుమాస్తా అనీ, ఈయనే అధికారి అనీ అప్పటికి నాకు తెలిసింది. సిగ్గుతో నీరై పోయాను. నోటమాట కూడా రాలేదు.

నేను ఆస్థితిలో ఉండంగానే మావాడు ఆయనను నాకు ఎరుకపరచాడు. నేను ఆయనకు షేక్‌హాండ్ ఇవ్వాల్సింది మరిచిపోయి నిలబడ్డా, వైష్ణవ మాయయో అన్యస్థితిలో ఉన్నాను. ఆయన నా చెయ్యి పట్టుకొని గట్టిగా ఊపి "మీ గొప్పవాళ్ళు మీరేనా! పేరు విన్నాను. ఎప్పుడూ చూడలేదు." అని గట్టిగా నవ్వాడు.

అమ్మాయి ప్రయాణపు ఫలహారాలూ, కాఫీ, ముందుకు వచ్చినై. అందరూ సంతోషంతో తీసుకొంటున్నారు. నేను అయోమయస్థితిలో ఉన్నాను. ఆయన కులాసాగా ఏవో ప్రశ్నలు అడుగుతున్నాడు. మావాడు ఏదో వినయంగా సమాధానాలు చెబుతున్నాడు. నాకు మాత్రం ఆనందంగా లేదు. ఏదో గొప్ప తప్పు చేసినవాడిలాగ నేను బాధ అనుభవిస్తున్నాను. చివరకు ఆ అధికారి మావాడివంక తిరిగి "ఏమయ్యా, నీవు టీపార్టీలకూ వాటికీ తరుచు వెళ్ళుతూ ఉంటావా?" అని అడిగాడు. అతను అడగటం మామూలు ప్రశ్న అడిగినట్లు లేదు. ఏదో ఎత్తిపొడుపు మాటలాగ ధ్వనించింది.

"ఎప్పుడైనా వెళుతూ ఉంటానండి! ఇవ్వాళ రెండు గంటలకు ఓ టీ పార్టీకి వెళ్ళాను. అక్కడనుంచే ఆయనకోసం స్టేషనుకు వచ్చేశానండి" అన్నాడు మావాడు.

"అది సరే. కొంపా గోడీ, ఏమీ పట్టించుకోకుండా తిరుగుతూ ఉంటావు పూటుగా?" ఈ ప్రశ్నలో కొంచెం వేడి ఉన్నట్లు తెలిసింది మాకు.

"అబ్బే, లేదండీ" అంటూ మావాడు తెల్లపోయినాడు. "లేదనబోకు, రాత్రుళ్ళు నిన్ను ఇంటికి రానిస్తే, వచ్చినా ఏ ఒంటిగంటకో వస్తావని, నాకు తెలుస్తున్నది." అని అన్నాడాయన తీవ్రంగా, దర్జాగా, ఉట్టిపడుతున్న కంఠస్వరంతో. నాకు భయం వేసింది. అవమానంతో కుంగిపోయినాను.

"పచ్చి అబద్ధం అండీ! ఎవరండీ ఇల్లాంటి సంగతులు మీకు చెప్పింది? దుర్మార్గం లేనిపోనివి అల్లాగ చెప్పటం కేవలం దుర్మార్గం" అని మావాడు గోల పెట్టాడు.

ఆ బాబ్బాయికి అధికారి వాడివంక ఇంకా కొరకొరా చూస్తూ "దుర్మార్గం వీడిలాగ కనపడుతున్నది. నన్ను గురించి ఇల్లాగ చెప్పింది బజారు మనిషి కాదు. చాలా పెద్దమనిషి" అన్నాడు తీవ్రంగా.

"ఎవరండీ ఆ పెద్దమనిషి! నన్ను గురించి నా అధికారులతో ఇల్లాంటి అబద్ధాలు చెప్పిన వాడు ఎల్లాంటి పెద్దమనిషో చూస్తాను, ఆయనను నా ఎదటకు తీసుకురండి" అని మావాడు పౌరుషంగా అన్నాడు.

"ఎదటకు తీసుకురావటం ఎందుకులే! కాని నీవు ఇల్లాగ ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావు, ఆఫీసు పనులు సక్రమంగా చెయ్యవని ఎల్లాగ నమ్మకం?" ఈ మాటలు ఆయన అధికారలాగా అన్నాడు.

మావాడు కలత పడ్డాడు. తోచకపోయి, "పచ్చి అబద్ధం. ఆ చెప్పిన అయనను పిలిపించి న్యాయం విచారించాలి," అని ప్రాధేయపడ్డాడు.

నేను ఏం చేయాలనుందీ తోచలేదు. అంతకు పూర్వం నేను చెప్పిన వన్నీ అబద్ధాలు అని ఒప్పుకొంటే నేను అధికారి దృష్టిలో పచ్చి దుర్మార్గుడ్ని అయిపోతాను. కాదు, నేను చెప్పినదంతా నిజమే అని నిలవతొక్కుకుంటే మావాడిమీద ఆయనకు కోపం రావచ్చు. అందుకని ఏమీ మాట్లాడలేక ఊరుకొన్నాను.

చివరకు ఆయన మావాడిని అడిగాడు, "నన్ను గురించి ఈమాటలన్నీ నాకు చెప్పింది ఎవరో తెలుసునా?" అని.

మావాడు మాట్లాడ లేదు. “ఇదుగో తీసుకోండి, మీ బాకీ!” అని నావంక చూశాడు.

పిడుగు పడ్డట్టు అయింది, మావాడు నిర్ఘాంతపోయి నావంక వెర్రిగా, జాలిగా, చూశాడు. నేనే కాస్త ధైర్యం తెచ్చుకొని “ఒక్క పొరపాటు జరిగిందండి. మిమ్మల్ని......”

అని ఏదో చెప్పవస్తుంటే ఆయన నామాటకు అడ్డొచ్చి “నాకు తెలుసు లెండి మీరు పొరపడటం నేను గ్రహించకపోలేదు. ప్రయాణంలో మాసిపోయిన బట్టలూ, నేనూ, పెద్దమనిషి అని అనుకొనే స్థితిలో లేకపోవటం మూలాన మీరు పొరపడ్డారు. అయినా ఒకరితో మట్టుకు తెలిసిపోని అబద్ధాలన్నీ చెప్పటం తప్పు కాదండీ!” అన్నాడు.

“తప్పేనండి పొరపాటు అయిపోయింది” అని నేను నొచ్చుకొన్నాను. ఆయన విరగబడి నవ్వాడు.

కాసేపు అయినతరువాత నవ్వు ఆపుకొని అన్నాడు: “ఇల్లాగ మీరు అబద్ధాలాడటం ఇది మొదటిసారి కాదు. నేను చాలారోజులనుంచీ చూస్తున్నాను. మీరు వ్రాసిన దంతా చదువుతున్నాను. సాహిత్యరంగంలో ఎక్కువగా అబద్ధాలాడుతున్నారు” అన్నాడు.

ఈమాటలు విని నే నేమీ మాట్లాడ లేకపోయినాను. ఆతరువాత ఆయన మావాడివంక తిరిగి కోపంగానే చూస్తూ “అయితే నీవు బ్యాంకిలో ఉద్యోగంచేస్తూ ఊళ్ళో బాకీలు చేస్తున్నావు! బాగుందా ఇది!” అన్నాడు.

“ఎబ్బే! ఎక్కడా బాకీలు లేవండి. ఒక్క బియ్యపు వర్తకుడికే యాభై ఇవ్వాలి. నాకు రావలసిన సొమ్ముకూడా చూస్తే ఈ బాకీ ఒక లెక్కలోది కాదని తమకు తెలుస్తుంది. నాకు పొలాలమీద రావాల్సిన రెండువందల రూపాయలు రైతులు ఇంకా తెచ్చి ఇయ్యలేదు. ఆసొమ్ముకోసమే చూస్తున్నాను. ఈవారంలో తప్పక వస్తుంది. రావటంతో నే ఈబాకీ తీర్చేస్తానండి.” అని మావాడు వినయంగా సమాధానం చెప్పాడు.

ఈసమాధానం విని ఆయన ఏమాత్రం తృప్తి పడ్డట్టు కనిపించలేదు. ఆయన్ను ఏదో సందేహం బాధిస్తున్నట్లు స్పష్టంగా కనిపించింది. ఏదో ఆలోచిస్తున్నాడు. ఎందుకో విసుక్కొన్నట్లుంది.

ఆయన వైఖరి చూస్తే నాకూ భయం వేసింది. ఆయన అన్నమాట నిజమే. బ్యాంకులో ఉద్యోగం చేస్తూ, ఊళ్ళో అప్పులు చేయటం తప్పే. దీన్ని మనస్సులో పెట్టుకొని ఆయన మావాడికి ఏదైనా అపకారం చేస్తాడేమో నన్న భయం నన్ను చాలా బాధ పెట్టింది. నేను చేసిన పొరపాటువల్ల కదా ఇంత అవస్థ వచ్చింది అనుకొని కష్టపడ్డాను. మావాడూ విచారపడుతున్నాడు. అధికారి విచారపడుతున్నాడు.

౮

ఇంతలో ఎవరో ఒక ఆయన చేత్తో ఒక పుస్తకం పట్టుకొని వచ్చి, గుమ్మంలో నుంచున్నాడు—ఎవరో చాలామంది ఉన్నారూ మనం వెళ్ళటం బాగుండదు—అని ఆయన అనుకొని ఉంటాడు. లేకపోతే అంతసేపు గుమ్మంలో నుంచోవలసిన పని లేదు. ఆయన వాలకం చూచి బియ్యపు వర్తకుడు ఆయనే అనుకొని మావాడి వంక చూశాను. వాడు మొదట ఆశ్చర్యపడి తరువాత తెల్లబోయినాడు. ఆ అధికారి నావంక ఓసారి మావాడి వంక ఓసారి చూసి ఆ క్రొత్తగా వచ్చింది ఎవరైందీ గ్రహించాడు.

ఎవరికోసం? అని అధికారి ఆ క్రొత్తగా వచ్చిన ఆయనను అడిగాడు. పంతులుగారికోసం అంటూ ఆ వర్తకుడు మా బావమరిదివేపు చెయ్యి చూపాడు. దాంతో అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది ఆయన ఎవరు అయిందీ.

ఎల్లాగూ అందరికీ తెలిసిన విషయమే కదా, ప్రత్యేకంగా జరగబోయే ప్రమాదం ఏమీ లేదు అనుకొని నేనే ఆయనను కూర్చోమని కుర్చీ చూపిం

శాను. ఫలహారం ముందు పెట్టి కాఫీకూడా ఇచ్చాను. ఆయన నవ్వుతూ కూర్చున్నాడు. మావాడు మట్టుకు పది లంఖణాలు చేసి, ఆరోజునే పథ్యం పుచ్చుకొన్నవాడి ముఖం పెట్టాడు. ఆయన బియ్యపు వర్తకుడా, మరి బియ్యపు అడగటానికి వచ్చాడా అన్న సంగతి గ్రహించలేకపోతున్నాడు. ఆ అధికారి నివ్వాలు కక్కుతున్నాడు.

నేను ఈవిచిత్ర సంఘటనను గూర్చి ఆలోచించటం మొదలుపెట్టాను. అధికారిని అనుకొన్నట్లు గౌరవించలేకపోయినాను. కటువుగా మాట్లాడి పంపేద్దామనుకొన్న షావుకారుకు కుర్చీ యిచ్చి గౌరవించాను. మనం అనుకొన్నది అనుకొన్నట్లు జరగక వ్యవహారం తలక్రిందు లౌతూంటుంది గదా అనుకొంటూ కూర్చున్నాను.

మావాడు ఏమీ మాట్లాడలేదు. నిశ్చేష్టుడై పోయినాడు తలవంచుకొని కాఫీ తాగుతున్నాడు. అధికారి కప్పు చేత్తో పట్టుకొని కాఫీతో పాటు కోపాన్నికూడా కొంచెం కొంచెంగా మింగుతున్నాడు.

బియ్యపువర్తకుడు తనబాకీసంగతి ఏమీ ఇంతవరకూ ఎత్తలేదు. ఊరికే నవ్వుతూ కాసేపు కూర్చుని మావాడిని పలకరించి "మీరు మీబాబుగారా?" అని నన్ను చూపుతూ అడిగాడు. అవునని మావాడు తల ఊపాడు. బ్యాంకు అధికారివంక చూస్తూ "వారు బంధువులా?" అని ఇంకో ప్రశ్న వేశాడు. కాదు, మన బ్యాంకీ అధికారి అని మావాడు చెప్పాడు. షావుకారు విని ఆశ్చర్యపోయి, అల్లాగా అండీ, నమస్కారం, అంటూ వినయం కనపర్చాడు.

నలుగురిలో బాకీ సంగతి ఎత్తకపోవటంవల్ల షావుకారు మేం అను కొన్నంత చెడ్డవాడు కాడని తేలింది. అధికారిమట్టుకు కోపంగానే ఉండి చివరకు మావాడివంక తిరిగి, "మీరు ఎవరు?" అని అడిగాడు షావుకారును చూపిస్తూ.

"బియ్యపు వర్తకుడు."

“వట్టి అబద్ధం అండీ, ఆయన చెప్పింది. ఆయన మాటలే నమ్మొద్దూ!” అన్నాడు షావుకారు దీర్ఘాలు దీస్తూ.

నాకు చచ్చేచావు అయింది. వీడు కూడా నే నేదో అబద్ధం కల్పించి చెప్పాననేసరికి. పాపం అధికారే నా పాలిటి దేవుడై అ కాస్త మాటా నిలవదీసి అడిగాడు. “ఆయన అబద్ధం ఆడుతున్నాడు అంటావేమయ్యా? నారాయణమూర్తిగారు మట్టుకు అనటం లేదా బాకీ ఉన్నమాట నిజమేనని?”

“పాపం పంతులుగారికి తెలియక చెప్పారు. వారు నాకు ఒక్క దమ్మిడీ అయినా బాకీ లేదు” అన్నాడు షావుకారు.

అందరం పిచ్చిచూపులు చూశాము. షావుకారుకు ఏమన్నా పిచ్చి ఎక్కలేదు గద అనుకొన్నాము. ఒక్కక్షణం అయిన తరువాత మాకు ఒకటి తోచింది. మావాడి ఉద్యోగానికి ముప్పు వస్తుందని షావుకారు ఎత్తిన ఎత్తు ఇది అనుకొన్నాము; అనుకొని సంతోషించాము. అధికారి మట్టుకు ఈమాత్రం ఊహించలేడా? ఊహించికూడా ఏమీ అనలేక ఊరుకొన్నాడు. ఎవ్వరం ఏమీ మాట్లాడలేదు.

నిశ్శబ్దం. ఎంతసేపు? అరనిమిషం. ఇంతలో అధికారి; ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలాగ చివుక్కున విసురుగా తల ఎత్తి షావుకారు వంక చూస్తూ “నీకేం బాకీ లేనే లేదా? ఏది పుస్తకంలో జమ ఉందేమో చూడనీ” అన్నాడు. మంచి ప్రశ్న. అధికారి కూడా చాలా తెలివైన వాడు అనుకొన్నాము.

వర్తక శిఖామణి ఎత్తుకు ఎత్తు గొప్పదే కాని అధికారి ఇల్లాగ పుస్తకం చూపమని అడుగుతాడని ఊహించి ఉండడు. అందుకని కాపీ చేస్తుండగా పట్టుబడ్డ స్కూలు కుర్రాడు లాగ తెల్లముఖం వేస్తాడని అందరం ఒక్కసారి అటు చూశాము.

వర్తకుడు తెల్లముఖం వెయ్యలేదు. ధైర్యంగా, నిశ్చలంగా చూడండి కావలిస్తే—అంటూ పుస్తకం ఆయనకు అందించాడు. నేనూ, మావాడూ,

అధికారీ, అక్కడున్న వాళ్ళం అందరం కూడా ఆకాశంలోనుంచి, ఏదో, విచిత్రవస్తువు కిందికి దిగుతూ ఉంటే, అది బాంబా, విమానమా, మనిషా, బొమ్మా, అని ఎంత విస్మయంతో చూస్తామో అంత విస్మయంతో చూశాము అపుస్తకంవంక.

అధికారి పుస్తకాన్ని ఇంకా సందేహంతోనే అందుకొని, పేజీ తీసి, తాను చదువుకొని నవ్వుకొన్నాడు. అసలు సంగతి ఏమిటో చెప్పకుండా ఆయన ఒక్కడే ఆనందించటం నాకు కష్టంగా ఉండి, ఊరుకోలేక — నిజమేనా అండీ? బాకీ ఉందా? — అని అడిగాను అదుర్దాగా.

అప్పటికీ ఆయన స్పష్టంగా జవాబు చెప్పక అవునన్నట్లు తల ఊపుతూనే నవ్వాడు. నవ్వి మావాడి వంక చూశాడు.

ఆ తరువాత నన్ను జూచి నవ్వాడు. ఇల్లా నవ్వటం వల్ల నాకేదో సందేహం కలిగింది. బాకీ ఉంటే, ఉందని చెపితే సరిపొయ్యేది. ఆయన అట్లా చెప్పక ఊరికే అందర్నీ జూచి నవ్వటం సాగించాడు.

అందరికీ ఏమైనా అర్థం అయిందా అంటే ఒక్కడికీ నిజం ఏమిటైందీ తెలిసినట్టు లేదు. అంతా ఆయనకు గుడ్లు అప్పగించి తెల్లపోయి చూస్తున్నారు.

ఎంత సేపని ఊరుకోగలను? చివరకు నేనే నోరు చేసుకొని మా వాణ్ణి అడిగాను; "ఏం రా ఇచ్చి మరిచి పోయినావా ఏమిటి" — అని

"ఎన్నే సనివ్వలేదు. బాగా జ్ఞాపకం. నేను డబ్బుకు సంబంధించిన విషయాలు ఎప్పుడూ మర్చిపోను —" అని వాడు ఘట్టిగా చెప్పాడు.

అందరం తెల్లపోయినాము. ఏమీ బాకీ లేక పోతే ఆయన అల్లాగ బాకీ కోసం తిరగటం ఎందుకు సంభవించింది? బాకీ ఉన్నట్లయితే జమ ఎట్లా పడి ఉంటుంది! ఈ ప్రశ్నలకు సమాధానం ఏమీ తోచలేదు. పదిహేను నిమిషాలసేపు అందరం ఆ అధికారి వంక చూస్తూ కూర్చున్నాము.

ఈ పరిస్థితులు చూచి వర్తకుడు అప్పటి కప్పుడు జమ కట్టటానికి ఏమా

మాత్రం అవకాశం లేదు. అయినా తెలుసుకొందామని "జమ ఎప్పుడో చూడండి" అని అడిగాను అధికారిని. ఆయన నవ్వుతూ "షావుకారు చేసిన మాయ ఏమీ లేదు. ఇరవై రోజుల క్రితం జమ పడ్డది" అన్నాడు. ఈ తమాషా ఎట్లా జరిగిందో ఎవ్వరికీ తెలియలేదు.

"ఏమిటయ్యా ఈ నాటకం?" అని నేను షావుకారునే అడిగాను. ఆయన "పుస్తకంలో ఏమి వ్రాసి ఉందో పంతులుగారినే చదవమనండి తెలుస్తుంది" అన్నాడు.

అందరం అధికారి వంక తిరిగాము "చదవండి తొందరగా" అన్నట్లు చూస్తూ.

అధికారి "ఇట్లా ఉన్నది చదువుతాను వినండి. ఈ బాకీ గాను, సావిత్రమ్మగారి భర్త ఇచ్చిన రొక్కం యాభై రూపాయలు, అక్షరాలా యాభైరూపాయలు..." అని చదువుకొన్నాడు.

విస్మయము, ఆనందము పొంగుకొన్నాయి మా హృదయాల్లో. అందరి కంటె మా వాడు ఎక్కువగా ఆశ్చర్యపడుతున్నాడు. ఒక్క నిమిషం ఎవ్వరం రెప్ప వాల్చలేదు. ఏమీ చిన్న శబ్దమూ చెయ్యలేదు. మనస్సులోంచి చీకట్లను చీల్చుకొని వచ్చిన మెరుపుల్లాగ అందరి ముఖాలపైన చిరునవ్వు మెరిసింది. మెరుపుల వెంట ఉరుములు. అందరూ విరగబడి నవ్వారు.

అందరితో పాటూ మా పంతులు నవ్వటం మొదట. కాని వెంటనే వర్తకుడ్ని కొరకొరా చూస్తూ అడిగాడు; "ఏమయ్యా, సొమ్ము ముట్టిన తరువాత కూడా, ఆసంగతి నాకు చెప్పక, అల్లాగ, కాళ్ళు అరిగిపోయేలాగున తిరిగి సొమ్ము ఇమ్మని పీడించావు! నిజంగా బాకీ ఉన్నప్పుడు ఎప్పుడూ అడిగి ఎరుగవు! బాకీ తీరినప్పుడు ఇల్లా బాధ పెట్టావు, ఏమిటిది?" ఈ అనటం కోపంగానే అన్నాడు.

"ఇదివరకు అంటే నా స్వంత బాకీ కాబట్టి మీరు ఎప్పుడు ఇచ్చినా పుచ్చుకొన్నాను. సొమ్ము అడగటంతోనే మీరు ఇస్తారని ధైర్యం. ప్రత్యే

కంగా అడగటం అవసరం లేకపోయింది. ఆరోజున ఏదో అవసరం వచ్చి అడగ్గానే, అమ్మాయిగారు, బాకీమొత్తం యావత్తూ నాకిచ్చి, మళ్ళీ ఆ సొమ్ము యావత్తూ మీ వద్దనుంచి వసూలు చేయమని కోరారు. ఆమె గారు ఇచ్చారని చెబితే మీరు మళ్ళీ ఇయ్యరు. అందుకని ఆవిషయం మీకు చెప్పలేదు. కాని మీరు నాకు బాకీ లేకపోయినా ఆమెకు బాకీ వున్నారు. అమ్మాయిగారికి ఇవ్వాల్సినసొమ్ము కోసమే నేనంతగా తిరిగింది. నాసొమ్ము కోసమైతే తిరగనే తిరగను అన్నాడు. అంతా విని నవ్వుకొని ఊరుకొన్నారు.

౫

సాహుకారు పాపం, అమాయకంగా, అధికారి మావాడికి అపకారం ఏమైనా చేస్తాడేమో నన్న భయంతో ఉన్నది ఉన్నట్లు చెప్పాడు: అం దులో ఏమీ సందేహం లేదు. ఈసంగతి అంతా విని అందరూ మరోసారి నవ్వుకొన్నారు. చాలా తమాషా అయిందనుకొన్నారు. అంతవరకూ బాగానే ఉంది.

దానితరువాత జరిగినకథే నాకు కష్టం కలిగించింది. సాహుకారు సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. అధికారి మావాడితో అన్నాడు; "నీవు ఏదో బాకీ చేశావని నాకు తెలియడం మూలాన, నేను స్నేహారీత్యా నిన్ను మందలించాను గాని మరోటి కాదు. పెద్దవాడిని కాబట్టి నీకు మంచిమాట చెప్పాను. నేను అన్నమాటలు మనస్సులో ఉంచుకోకేం!" అని.

మావాడు ఆయనతో "తమ కేం తెలుసూ? అయినా తమరు అన్నదీ ఏమీ లేదు" అని నవ్వి ఊరుకొన్నాడు.

"నారాయణ మూర్తిగారికి, పాపం, ఏమీ తెలియదు. భార్య బాకీ తీర్చిన విషయమూ తెలియదూ, ఆయన బావగారు ఈసంగ తంతా తమకు

చెప్పిన విషయమూ తెలియదు! పాపం ఆయన అనవసరంగా ఖంగారు పడటం సంభవించింది." అన్నాడు గుమాస్తా అధికారితో, అందరికీ వారి విషయంలో సానుభూతి కలిగేలాగున. అందరూ నాకేసి చూచి జాలిపడ్డట్లు చూపులు చెపుతునే ఉన్నాయి.

అసలు ఈగలభాకు అంతా మూలకారణం మా నాతిభార్యం. ఇట్లా సంగతి అని మాటమాత్రం అన్నా నాకు చెప్పలేదు. ఇంత గ్రంథం జరుగుతూ ఉంటే ఊరుకొని ఉందే కాని అసలు రహస్యం బయట పెట్టలేదు. ఆ అయ్యాయిని ఇదే మని ఒక్కరూ ఒక్కమాట అయినా అనలేదు. పైగా బాగా తెలివైంది అని మెచ్చుకొన్నారు.

ఇక మిగిలిపోయింది నేను. నా సంగతి ఒక్కరూ ఎత్తలేదు. "పాపం, ఈయన అన్యాయంగా ఫూల్ అయిపోయినాడు" అని ఒక్కరూ — ఒక్కరైనా జాలి చూపలేదు.

వారి సానుభూతిని ఆశిస్తూ, చివరకు నేనే అన్నాను: ఇంతకూ, నేను మిమ్ముల్లను చూచి వర్తకుడు అనుకోటం వల్ల, ఇంతగొడవ జరిగింది అనుకోండి. కాని ఇందులో నాతప్పు ఏమీ లేదు. అట్లాగ ఎందుకు అనుకోవలసి వచ్చిందంటే...అని చెప్పబోతుంటే, వాళ్ళు వినక, ఎల్లా సంభవిస్తే ఏం; తెలిందికథ నడిపారు. అని నవ్వారు ఈ గొడవంతా నేను కావాలని తెచ్చి పెట్టినట్లు.

౧౯౮౩

# పరిచయము

తల్లావఝ్ఝల శివ శంకర శాస్త్రి: కాజగ్రామమున, మంగళగిరిక్షేత్ర సమీపమున, గుంటూరు మండలము, క్రీ.శ. ౧౮౯౨ జననము. రచనలు: పురాణ కథలు; నీలకంఠం కథలు. హిందీ, బెంగాలీ, కన్నడ భాషలనుంచి చాలా కథలూ, సంస్కృతమునుంచి కథా సరిత్సాగరమూ తెలిగించినాడు. ౧౯౩౮ సంవత్సరమున హైదరాబాదు నగరములో అఖిలాంధ్ర కథక మిత్రుల సమ్మేళనానికి అధ్యక్షత వహించినాడు. ఆల్ ఇండియా రేడియో మదరాసు కేంద్రమున కథానికను గురించి ప్రసంగము చేసినాడు. కథలకు పలువుర ప్రాధాన్యమిచ్చిన 'సాహితి', 'సఖి', 'ప్రతిభ' మొదలైన పత్రికలకూ, సరస్వతీ గ్రంథమండలి, ఇత్యాది గ్రంథమాలికలకూ పూర్వము సంపాదకుడు. వివిధ భాషలలో, శాస్త్ర, కళలలో, కృషి చేసినాడు.

శిష్ట్లా బాబు రావు: పూరిప్పాడి, గుంటూరు మండలము, జననము ౧౯౦౮. సాహితి, సఖి, భారతి మొదలైన పత్రికలలో కథలు ముద్రితములు. 'సప్తపది' అనే కథాసంపుటి ఉన్నది. బొంబాయి నగరములో SIR J. J. SCHOOL OF ART లో బహుకాలము అభ్యసించిన చిత్రకారుడు. గుంటూరు శ్రీ శారదా నికేతనములో చిత్రకళోపాధ్యాయుడుగా కొన్ని సంవత్సరాలు ఉన్నాడు.

శ్రీరి నర సింహ శాస్త్రి: గుంటూరు, ౧౯౦౦ జననము. బి. ఎల్. పట్టాలో న్యాయవాది. అనేక కథలు, నాటికలు, పద్యకావ్యములు రచించినాడు. ఇంగ్లీషులోనుంచి కొన్ని కథలు తెలిగించినాడు. కొన్ని స్వతంత్ర రచనలు ఇంగ్లీషులో చేసినాడు. మంత్ర, తంత్ర, శాస్త్ర నిష్ణాతుడు.

**అడివి బాపిరాజు:** ౧౮౯౫, పశ్చిమగోదావరి మండలము, సరిపల్లి గ్రామములో జననము. ౧౯౧౬ లో బి. ఏ. కొంతకాలము భీమవరములో న్యాయవాది. ౧౯౩౪-౩౯ బందరు జాతీయకళాశాలా అధ్యక్షుడు. రమారమి ౭౦ కథలు రచించినాడు. కొన్ని హిందీలోకి, ఇంగ్లీషులోకి పరివర్తితాలు. హిమబిందు, నారాయణరావు, తుపాను, ఇత్యాది నవలలూ, అనేక గేయములూ రచించినాడు. నాటక కళలో ప్రవీణుడు, శిల్పాచార్యుడు.

**వేదుల సత్యనారాయణ శాస్త్రి:** భద్రాచల ప్రాంతాన ౧౯౦౦ లో జననము. శతావధానాలు చేస్తూ ఆశుకవిత్వము చెప్పినవాడు. ౧౯౩౮ లో ఉభయభాషాప్రవీణ. ౧౯౪౩ లో మహాకవి ఉపాధి. కథలు రచించడమే కాక, వంగభాషనుంచి అపరాధిని, ధర్మపాలుడు, రంగమహల్, మొదలైన నవలలు తెనిగించినాడు. 'రాణాప్రతాప్' స్వతంత్ర నాటకము. పెద్దాపురములో మిషన్ హైస్కూలులో పండితుడు. దీపావళి ఆదిపద్యకావ్యములు, కొన్ని సినిమా నాటికలు రచించినాడు.

**విశ్వనాథ సత్యనారాయణ:** కృష్ణామండలము, నందమూరు గ్రామంలో ౧౮౯౫ లో జననము. ౧౯౨౮ లో ఎం. ఏ. ౧౯౪౧ లో కవిసమ్రాట్ ఉపాధి. కొంతకాలము బందరు జాతీయ కళాశాలలోను, గుంటూరు క్రైస్తవ కళాశాలలోను, ౧౯౩౮ నుంచి బెజవాడలో ఉయ్యూరు రాజా వారి కళాశాలలోను ఆంధ్రోపన్యాసకుడు. మాబాబు, హాహా హూహూ, జేబుదొంగలు, మొదలైన అనేక కథలు, ఏకవీర, వేయిపడగలు, చెలియలికట్ట మొదలైన నవలలు, అనేక నాటక పద్యకావ్యములు; రామాయణము రచించినారు. బహుళ గ్రంథకర్త. వేదాధ్యయన రతుడు. ఈయన రచనలు కొన్ని హిందీ ఇంగ్లీషు భాషలలోకి పరివర్తితములు.

**కవికొండల వెంకట రావు:** తూర్పుగోదావరి మండలములో శ్రీరంగపట్టణ గ్రామమున ౧౮౯౨ లో జననము. బి. ఏ., బి. ఎల్. ౧౯౧౯ నుంచి నరసాపురములో, తరువాత రాజమహేంద్రవరములో న్యాయవాద వృత్తి. ౨౦౦ కథలు, ౨ నవలలు, ౯౦౦ ఖండ కావ్యములు, ౬౦౦ గీతికలు ౨౦౦ ఇతర రచనలు చేసినాడు. సుమనోజ్ఞాని అనే పేరుతో అఖండమైన కథాసముచ్చయము ఉన్నది.

**వెంపటి నాగభూషణం:** ౧౯౦౯ లో మచిలీపట్టణములో జననము. ఎం. ఏ. విజయనగర సంస్థానములో మహారాజావారి కళాశాలలో, ౧౯౩౬ తర్వాత పూనానగరములో వాడియా కళాశాలలో ఆంగ్లభాషాధ్యాపకుడు. ఆంగ్లభాషలో అనేక పద్యగద్యకావ్యములు ప్రకటించి, ఆంగ్లేయుల ఆదరము పొందినాడు. ౨౦౦ కథలు తెలుగులో వ్రాసినాడు. 'ముత్యాలశాల' అనే కథాసందోహం పద్మావతీ పరిషత్తున ప్రకటితము. ఈయన రచనలు కొన్ని హిందీ మొదలగు భాషలలోకి తర్జుమా అయినవి. పూలపల్లకి, కింకిణీ మాల, నెమలిపింఛం, అముద్రితాలు.

**మల్లాది రామకృష్ణ శాస్త్రి:** మచిలీపట్టణములో ౧౯౦౫ లో జననము. గురువులవద్ద శాస్త్రాభ్యాసము చేసినాడు. ౧౯౩౮ లో ఎం. ఏ. రమారమి ౧౦౦ కథలు రచించినాడు. బహుభాషలలో, కళలలో ప్రవీణుడు. ఈయన రచనలు హిందీ మొదలగు భాషలలోకి తర్జుమా అయినవి.

**సురవరం ప్రతాప రెడ్డి:** రాయచూరు జిల్లా, అలంపూరం తాలూకా ఇటిక్యాలపాడులో ౧౮౯౬ లో జననము. ౧౯౨౦ లో బి. ఎల్. ౧౫ సంవత్సరములనుంచి హైదరాబాదులో 'గోలకొండ' పత్రికకు సంపాదకుడు. చాలా కథలు రచించినాడు. 'ప్రతాపరెడ్డి కథల' సంపుటి ముద్రి

తము. ఈయన రచనలలో 'శుద్ధాంతకాంత' అనే నవల, ఉద్యల విషాదము, తుకారాము అనే నాటకములు, విమర్శలు, జీవితచరిత్రలు అనేకమున్నవి. సంస్కృత ఉర్దూ భాషలలో ప్రవీణుడు.

**వింజమూరి శివరామా రావు:** తూర్పుగోదావరి మండల పిఠాపురములో గొల్లప్రోలు లో జననము. కాకినాడ కళాశాలలో బి. ఏ. చదివినాడు. 'మహాసాగ' కథలు వెలిగించాడు. 'ఆకలి' కథలు మొదటివైనవి, చాలా పద్యకావ్యములు, నాటకములు రచించినాడు.

**మునిమాణిక్యం నరసింహా రావు:** గుంటూరు మండలములో శ్రీ: జగర్లా లో జననము. బి. ఏ., యల్. టి. బందరు హిందూకళాశాలా హైస్కూలులో ఉపాధ్యాయుడు. చాలా కథలు, నవలికలు, హాస్యగ్రంథములు, నాటికలు రచించినాడు. కాంతం కథలు, కాంతం కైఫీయత్, ఉపాధ్యాయుడు, దొరబాబు, మేరీ కహానీ ఇత్యాదులు ముద్రితములు. కొన్ని రచనలు హిందీ అరవభాషలలోకి పరివర్తితములు.

